Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

102873

★ జర్మనుల పెద్ద దండయాత్ర ఎప్పుడు? ★

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక


★ హిట్లరుషరతులకు ఫ్రాన్సు లొంగకుండుట ★

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసంII ర మాఘ బII ౨ (౧౩-౨-౧౯౪౧ ఫ.) గురువారము సంచిక ౭౫

# బెంఘాజీలో బ్రిటిషుసేనల ప్రవేశము

## అన్ని రంగాలలోను బ్రిటిషువారి పురోగమనము

### ఇటాలీయులప్రతిఘటన తక్కువగాఉన్నది

ఉత్తరఆఫ్రికాలో బ్రిటిషుసామ్రాజ్యసేనలుఫిబ్రవరి ౬ వతేదిన మరొకగంతువేసి బెంఘాజీలోప్రవేశించినవి. తూర్పులిబియాలో ఇది ఇటాలీయుల కడపటిరక్షణస్థానము. బెంఘాజీ యుద్ధవ్యూహప్రాధాన్యంగలస్థానము ఇరిట్రియాలో మరొకఅప్పుగిజయముచేకూరినది. ఈప్రాంతంలో కరెన్పైదాడికి ప్రాథమికచర్యలు సంతృప్తికరంగా సాగుతున్నవి. ఇరిట్రియాలో బ్రిటిషుసైనికదళాలుప్రవేశించినప్పటినుంచి ఇప్పటివరకూ అక్కడవశపడిన శత్రుఖైదీలసంఖ్య ౪౫౦౦మంది వుంటుంది ఇంకా చాలామందిపట్టుబడుతున్నారు

అబిసీనియాలో గొండారస్థావైపు బ్రిటిషువారి పురోగమనం సంతృప్తికరంగా సాగుతున్నది. అనేకమందిఖైదీలుకూడ ఈప్రాంతంలో బ్రిటిషువారికిచిక్కుతున్నారు.

బ్రిటిషుగస్తీదళాలు ఇటాలీయు సోమలీలాండురంగంలో చొచ్చుకపోగలుగుతున్నవి.

బెంఘాజీపట్టణం ఇదివరలో మార్షల్గ్రాజియానికి కార్యాలయస్థానం గావుండేది. నౌకాశ్రయమేగాకుండా రాష్ట్రానికి రాజధానిపట్టణం కూడా బ్రిటిషుదళాలు విరినైకారాష్ట్రం అంతటినీదాదాపువశపరచుకున్నట్లే.

బెంఘాజీపతనంవల్ల, ఇటాలీయనులు సముద్రమార్గంద్వారా ఈప్రాంతంలో రిజర్వులనుచేర్చుకోడానికిలేదు సిర్టిద్వారాప్రయాసపడి చేర్చుకోవాలి బెంఘాజీఆక్రమణ బ్రిటిషు మెడిటరేనియన్లోవున్న నౌకాదళానికి అపారంగా సహాయపడుతుంది-సైనికులను సామగ్రిని చేర్చుకోడానికి మంచినౌకాశ్రయాలువున్న స్థానం-ఈరేవులో ఏట్టివాతావరణపరిస్థితిలోనైనా ప్రవేశించడానికి వీలున్నది. పెద్దక్రూయిజర్లుకూడా ఈరేవును ఉపయోగించుకోవచ్చు

బెంగాజీ ఆక్రమణానంతరము సైన్యదళాలలో ముందువరుసలు బెంఘాజీకిదక్షిణంగా౧౫౦మైళ్ళదూరంలోవున్న ఎల్ అఘీలాఅనే ఒకతీరప్రాంతపట్టణాన్ని ఆక్రమించి, ట్రిపోలీమార్గంపట్టుతున్నవి-బెంఘాజీవద్ద అనేకవేలమందిఇటాలీయసైనికులు ఖైదీలుగాపట్టుబడిరి-మందుసామగ్రి చిక్కినది-

ఎరిట్రియాలో ఇటాలీయసైనికులు చెల్లాచెదరుగా ఆరిజావైపుకు వెంబడింపబడుచున్నారు-

వెనుకకుమరలిపోతున్న ఇటాలీయసేనలపై విమానదళాలు దాడిసలుపుతున్నవి- అబిసీనియాలో టానాసరస్సుకు దక్షిణంగా అలోమాటావద్ద విమానాలుదిగేందుకుగల భూమిమీద ఎనిమిదిఇటాలీయువిమానాలను బ్రిటిషువిమానాలు ధ్వంసం చేసినవి- అక్కడసైనికశిబిరాన్నికూడా బ్రిటిషువిమానాలు చాలా మట్టుకుధ్వంసంచేశాయి

అబిసీనియాలో గొండార్రోడ్డుమార్గాన బ్రిటిషుసేనల పురోగమనానికి అక్కడచాలా విశాలప్రదేశాన్ని ఆవరించుకున్న గనులు అడ్డుపడుచున్నవి- కానిఅవిఇప్పుడు ఖాళీచేయబడుతున్నవా- ఇటాలీయసోమాలిలాండులో బ్రిటిషువిమానాలు గస్తీతిరుగుతూ, ఇంకాలోపునప్రవేశిస్తున్నాయి-

ఫిబ్రవరి ౩,౫ తారీఖులలో మాల్టామీద శత్రువిమానాలు కొన్ని బాంబులుపడవేసెను- కాని బ్రిటిషు విమానాలేవియు నష్టపడలేదు-

### అల్బేనియాలో ఇటలీ-గ్రీసులయుద్ధము

అల్బేనియాలో ఇటలీగ్రీసులయుద్ధమునందు ఫిబ్రవరి౪వతేదినుండి ౧౦వతేదివరకు వచ్చినవార్తలలో ఎక్కువవిశేషాలులేవు. అక్కడమంచెక్కువగాపడుచున్నది. మధ్యఆల్బేనియాలో ఫిబ్రవరి ౭వ తేదినాటికి టెపెలిని ప్రాంతంనుండి ఇటాలీయులు ఖాళీచేసివెళ్ళిపోయిరి. ఉత్తరరంగంలో స్కూంబినది మూలస్థానంలో యుద్ధంజరుగుచున్నది. పోగ్రాడెట్జ్కు ఉత్తరమునకూడ యుద్ధముసాగుచున్నది, ఫిబ్రవరి౫వతేదినాడు మధ్యరంగంలో క్లిసూరాలో ఇటాలీయులు గ్రీసుసేనలను ముట్టడించ యత్నించిరిగాని తరిమివేయబడిరి ఫిబ్రవరి౧౦వతేదినాటికి గ్రీసులు క్లిసూరాప్రాంతంలో క్రొత్తస్థానాలను పట్టుకొనగలిగిరి. ఫిబ్రవరి౯వతేదిన గ్రీకులు ౭ఇటాలీయువిమానాలను క్రిందకూల్చిరి. క్లిసూరాప్రాంతంలో బ్రిటిషువైమానికులు ౮ఇటాలీయువిమానాలను నాశముచేసిరి. ఇటలీగ్రీసులయుద్ధం ప్రారభమైనతర్వాత మొదటిమూడునెలలలో గ్రీసులచే ఇటాలీయ జలాంతర్గాములు నాశముచేయబడినవి. గ్రీసులఓడలేవియు నష్టపడలేదు.

### బ్రిటను, జర్మనీలయుద్ధము

౨వరోజులనుండి బ్రిటనుపై రాత్రివేళలందు జర్మనువిమానాలదాడులు జరుగుచుండుటలేదు. అయినరోజులనుండి పగటిపూట జరిగేదాడులలో పెద్దవిశేషాలులేవు. ఫిబ్రవరి౭వతేది మధ్యాహ్నము ఈస్ఆంగ్లియాలో జర్మనుబాంబులుపడుటవల్ల కొద్దినష్టముకలిగెను, ఫిబ్రవరి౯వతేదిఉదయము ఇంగ్లాండు ఆగ్నేయతీరమందు ఒకజర్మనువిమానము, మధ్యాహ్నము ఫోక్స్టనువద్ద ఒకజర్మనువిమానము బ్రిటిషువారిచే క్రిందకూల్చబడినవి, ఫిబ్రవరి౯వతేది బ్రిటనులో అనేకప్రాంతాలపైకి జర్మనునౌకలు వచ్చెనట, కాని బాంబులుఎక్కువగావేయలేదు.

ఇకజర్మనీపైనను, జర్మనీవారాక్రమించిన దేశాలపైనను బ్రిటిషువిమానాలు చేసినదాడులు మాత్రము- ఈదాడులుచాల తీవ్రముగానేయున్నవి- ఫిబ్రవరి౬వతేదిరాత్రి ఫ్రాన్సుసముద్రతీరమందలి జర్మనులదండయాత్రరేవులగు డన్కర్కు మున్నగువాట్ల బ్రిటిషువిమానాలు బాంబులువేసెను-ఈదాడులనుండి ఒకబ్రిటిషువిమానం స్వస్థానానికి తిరిగిరాలేదు- ఫిబ్రవరి౭వతేదిరాత్రి బూలోను, డన్కర్కు రేవులపైనను, కలేవద్దగాగల ఫైనను బ్రిటిషువిమానాలు బాంబులు వేసినవి-౯వతేదినాడు నార్వేదక్షిణభాగపు తీరమువైపు డిస్ట్రాయరుల సహాయముతో పోవుచున్న శత్రుసామగ్రినౌకలపై బ్రిటిషువిమానాలు బాంబులువేసినవి- ఆనాటిరాత్రి జర్మనీలోమాన్హీంపై బాంబులువేసినవి- ౯వతేదిపగలు మరలనార్వేసముద్రంలో ఒకజర్మనుడిస్ట్రాయరు నౌకపైటార్పిడోలు వేయబడెను- జర్మనీ వాయవ్యభాగంలో ౧౦వతేదివేకువన బాంబులువేయబడినవి; మరియు డన్కర్కు, బూలోనురేవులపై బాంబులువేయబడినవి ఈప్రయత్నంలో రెండుజర్మనువిమానాలు క్రిందకూల్చబడినవి ఈవిమానాలతో కూడవచ్చిన పోలీసువిమానాలు రెండుజర్మనువిమానాలను క్రిందకూల్చినవి

రెండుబ్రిటిషు డెస్ట్రాయర్లు ఈవాలుగైరులో జాలలో శత్రువులచే నీటముంచబడినవి- బ్రిటిషు నౌకలు ఫిబ్రవరి౯వతేది వేకువజామున ఇటలీవారి జెనోవా, పైసా, లెగ్హార్న్ రేవులపై ఫిరంగులువేసి ఇటాలీయుసేనలకుముఖ్యములైనఎలక్ట్రిక్ పన్కులుమున్నగువాటికి నష్టముకలిగించెను- ఎదురొక్కనవచ్చిన ఇటాలీయ విమానాలనుండి రెండింటిని కూల్చెను- బ్రిటిషువారివిమానమొకటి కనుపించుటలేదు.

### చైనా, జపానులయుద్ధము

ఉత్తరచైనాలో హోనాన్ రాష్ట్రములో జపానువారుజరిపినదాడిని చీనావారు విజయవంతముగా త్రిప్పికొట్టేవారు జపానువారిలో ౨౦వేలమంది అపాయాలను పొల్పడిరి. కొన్నిముఖ్యమైనపట్టణాలు తిరిగిచీనావారికి స్వాధీనమైనవి.

జనవరి ౨౫ తారీఖున జపానువారు దండయాత్ర ప్రారంభించినతర్వాత చీనావారు ముందుగా సిద్ధంచేసిన రక్షణస్థానాలకు మరలిపోయి అక్కడను శత్రువులురాగానే ఎదురుముట్టడిచేసిరి జపానువారిని వెనుకకుతరిమి పీపింగుహాంకో రైల్వేమీదఉన్న చాలాపట్టణాలను స్వాధీనంచేసుకొనిరి.

జపానుసేనలు నౌకాదళసహాయంతో ఫిబ్రవరి ౪వతేదిఉదయం హాంగుకాంగుకు ఈశాన్యముగా దక్షిణక్వాంగుటుంగు రాష్ట్రం లో దిగినవి. ఈసేనలనుదించడంలో ఉద్దేశంమిర్స్ అఖాతం తూర్పుతీరంలోని హాయిూయాయువాంగు మార్గంమీదుగా చుంగుకింగుకు ఆయుధాలుచేరకుండా చూడడమే అని జపానునౌకాశాఖప్రకటనలోనున్నది.

దక్షిణహోనాన్ రాష్ట్రం ఉత్తచైనా, మధ్యచైనాలో గతఫిబ్రవరి ౪వతేదికిపూర్వం౧౫ రోజులలోజరిగినతీవ్రమైనపోరాటాలఫలితంగా ౯వేలకుపైగా జపానుసైనికులు చనిపోయిరని చీనాపత్రికలుప్రకటిస్తున్నవి. అన్ని యుద్ధరంగాలలో చీనావారు శత్రువులనుతిరమివేసిరట.

ఫిబ్రవరి ౧౫ వతేది హాంకాంగువద్ద దిగినజపానుసైనికదళాలుషాటోకౌను, హాయిూయాంగులనేరెండుప్రాంతాలను (హాంకాంగు సానాసరిహద్దులోవున్నవి) ఆక్రమించుకున్నవట. విశేషంగా యుద్ధపరికరాలనూ, మందుగుండుసామగ్రినీ(చుంకింగుప్రభుత్వవిని యోగంకోసం మిర్స్అఖాతంలో నిలచివున్న సామగ్రిఇది) జపానువారుపట్టుకునిరట.

మార్షల్ చియాంగుకేషేకుగారికి విదేశాలనుండిసహాయంరాకుండా జపానుయుద్ధరాజ్యపుహక్కులు కోరుటకు ఆలోచిస్తున్నదే? అనిజపానుశాసనసభలో ఒకప్రశ్నకుజవాబుగా జపానువిదేశాంగమంత్రి మత్సువోకా చెప్పెను,

మరికొన్నిప్రశ్నలకుజవాబుగా మత్సువోకా జపాను నిజోద్దేశ్యాలను ఇండియాప్రజానీకానికి స్పష్టంచేయవలసిన అవసరంఉన్నదని ఒప్పుకొనెను.

ఫిబ్రవరి ౪ వతేదిన జపానుఅమెరికాల నడుమపరిస్థితి ఇప్పటివలె ఇదివరకెప్పుడూ అపాయకరంగాలేదు' అనిజపానువిదేశాంగమంత్రి మత్సువోకాచెప్పినాడు అయితేజపానుతన ఆశయసిద్ధికొరకు యుద్ధానికి దిగదలచుకోలేదని అమెరికనులకు స్పష్టంచెయ్యదలచుకున్నాననెను

జపానుశాసనసభ బడ్జెట్కమిటీలో ఒకప్రశ్నకుజవాబిస్తూ సైనికంగాచెప్పెను జపానుఉద్దేశాలనూ, బలాన్నీఅమెరికా అపార్థంచేసుకుంటుందని. వారికియెట్లయినను అర్థంఅయేటట్లు ద్విగుణీకృతప్రయత్నంచేసెదననీ యితడనెను

"లండనులోఉన్న డచ్ప్రభుత్వం చట్టబద్ధమైనదేఅని జపానుగుర్తిస్తుందిగాని ఆచరణలో మాత్రమువేరు" అని ఒకజపానుఅధికారిఅనెను

రష్యాప్రభుత్వ జపానుతో వాణిజ్యసంధిచేసుకొనుటకై చర్చించుటకుసంసిద్ధంగా ఉన్నట్లు తెలియజేసినదట

చేపలవ్యాపారంవిషయమై జనవరి ౨౦వతారీఖున ఆచరణపూర్వకమగు ఒడంబడిక జరిగినతర్వాత దీనిమీద శాశ్వతసంధిచేసుకొనుటకు ఒకజాయింటుకమిటీఏర్పడి రాయబారాలు ధారాళంగాసాగుతున్నవట.

### జపానుపట్ల బ్రిటిషుసామ్రాజ్యనైఖరి

ఫిబ్రవరి ౪ వతేదిన జపానుయెడ బ్రిటను, ఆస్ట్రేలియాను విధానాలలోభేదంలేదని ఒకప్రభుత్వప్రముఖుడు బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభప్రశ్నోత్తరసమయంలో స్పష్టంచేసెను.

ఇటీవల ఆస్ట్రేలియాయుద్ధమంత్రి ఉపన్యసిస్తూ జపానుతో ఆస్ట్రేలియాకు వివాదంఏమీలేదని చెప్పిఉండుటవల్ల ఒక కామన్సుసభ్యుడు మాట్లాడుతూ దురాక్రమణను ప్రతిఘటించిపోరాడుతున్న చీనానుసహాయం చేయవలెననే సామ్రాజ్యవిధానానికి ఈఉపన్యాసం భంగకరంకాదని హామీఇవ్వవలసిందిగా కోరగా డొమినియనులసహాయమంత్రి షేక్స్పియర్ అట్లేఅనెను. ఆసియారాజ్యాలపట్ల జపాన్ అవలంబిస్తూన్న వైఖరి బ్రిటనుకుఎంతమాత్రమూ సంతృప్తికరంగాలేదనువిషయంఆస్ట్రేలియాకు పూర్తిగా తెలియబడినదా అనిఒకసభ్యుడుప్రశ్నించగా షేక్స్పియర్, అంతర్జాతీయప్రాముఖ్యంగల సమస్యలన్నీ ఆస్ట్రేలియాకుపూర్తిగా తెలుపబడుచున్నవనీ. ఈవిషయములో రెండుప్రభుత్వాలవడుమ అభిప్రాయభేదంలేదనీచెప్పిరి.

### ఫ్రాన్సుకు జర్మనుబెదరింపులు

ఫ్రాన్సు,జర్మనీదేశాల సంబంధపరిస్థితులుత్వరత్వరగా ఏదోక్రొత్తమార్పును దారితీస్తున్నట్లు కనబడుతున్నవి. ఫిబ్రవరి౧వతేదినాటికి మూడుప్రధానసంఘటనలు సంభవించినవి. నాజీఅనుకూలురైన ఫ్రెంచివారినాయకత్వంక్రింద పారిస్లో "జాతీయప్రజాపక్ష" స్థాపనచేయబడునని బెర్లినులోవార్తాకారులు తెలిపిరి. ఈక్రొత్తపక్షం తనదేశీయకార్యక్రమాన్ని సంపూర్తిగా నాజీపద్ధతిపైన అనుసరించుటకు అధికారమున్నది. ఈపక్షము అనుసరించు విదేశాంగవిధానములో "యూరోపియపునర్నిర్మాణము సాగించుట ఫ్రాన్సుజర్మనీలు మిగతాయూరపీయరాజ్యాల సహకారంతో ఆఫ్రికాను ఉపయోగించుకొనుట" ప్రధానాంశము.

విషీప్రభుత్వంపైన నాజీలు ఒత్తిడికలుగజేస్తున్నట్లు ఆనకకారవార్తలు విరామంలేకుండావస్తున్నవి మార్షల్ పెటెయిను నేడిభుజమైన అడ్మిరల్ డార్లాన్ అకస్మికంగా పారిసుకువెళ్లెట. మార్షల్ పెటెయిను క్రిస్మస్నాడు పంపినసందేశానికి జర్మన్ సమాధానం అందినమీదట అడ్మిరల్ డార్లాన్ పారిస్ప్రయాణముచెయ్యనట

మార్షల్ పెటెయినుకుహిట్లరుపంపిన ప్రత్యుత్తరం బెదరింపుధోరణిలో ఉన్నదని ఆ ప్రత్యుత్తరంలో ఫ్రాన్సు జర్మనీతో ఇంకా ... సహకారంచేయవలెనని ఫ్రెంచిమంత్రివర్గంలో మార్పులుజరిగి జర్మనీతోకలిసి పనిచేయగలిగిన రాజకీయవాదులను తీసుకోవలెననీ ఉండడమేకాక మధ్యధరాసముద్రపు ప్రాముఖ్యమూ. ఈరంగములోకూడా ఫ్రాన్సుజర్మనీతో సహకారంచెయ్యవలసిన ఆవశ్యకత తెలుపబడినది. మధ్యధరాసముద్రంలో సహకారంఅంటే ట్యునీసియాలోని ఫ్రెంచినౌకాశ్రయమగు బిజెర్టాను జర్మనీస్వాధీనంలో ఉంచడమేనట.

మార్షల్ పెటెయిన్ తలపెట్టిన జాతీయపునర్నిర్మాణానికి సహకారముచేయవలెనని ఫ్రెంచి ఉత్తరఆఫ్రికాప్రజలకు జనరల్ వేగాండ్ విజ్ఞాపనచేసెను. అశాంతిపుట్టించగల వదంతులతో ప్రచారంచేసేవారిపైని తీవ్రచర్యలు తీసుకొనబోవుచున్నానని ఇతడు తెలియజేసెను,

జనరల్ వేగాండ్ "ప్రజలు తమనాయకులను విశ్వసించవలె"నని అతడుఉద్బోధించెనని మీచిక్కులు వారికిపూర్తిగా తెలుసునని మనదేశపు భవిష్యతు విషయమే వారికిగలబాధ్యతచొప్పున చిక్కులు తొలగించడానికి ప్రయత్నిస్తున్నారని చెప్పెను.

"మనకొత్త ఆఫ్రికాలో మార్షల్ పెటెయిన్ తీసుకొనిరాదలచిన జాతీయవిప్లవంలో సాంఘికచర్యలప్రాముఖ్యాన్ని" జనరల్ వేగాండు నొక్కిచెప్పెను.

స్వతంత్ర ఫ్రెంచిదళాల సేనాధిపతి వైస్అడ్మిరల్ మ్యూసిలీర్ గారి ఫ్రంచి జాతీయతనుతొలగించివేసినట్లు విషీలో ప్రకటించినారు. ఇంకామరికొందరు ఫ్రెంచిప్రముఖుల జాతీయతకూడా తొలగించబడినట్లు తెలుస్తున్నది.

ఫిబ్రవరి౪వతేదిరాత్రి బ్రిటిష్విజయంమీద ఫ్రాన్సు ఆధారపడివున్నదను ఒక హెచ్చరికను ఫ్రెంచిభాషలో స్టట్గార్టులో జర్మన్ రేడియోస్టేషను బ్రాడ్కాస్టుచేసెను,

"రాజకీయ ఆర్థిక, సాంఘిక, విషయాలలో అత్యావశ్యకమైనట్టి నిజమైన సహకారంచెయ్యడానికి ఫ్రెంచిప్రజలందరూ ఆలస్యంచెయ్యకుండా వెంటనే నిశ్చయించుకుంటేనేతప్ప ఇప్పుడు ఫ్రాన్సుపడుతున్నకష్టాలునివారణ కాకుండా కంటె, మరింతఅధికమవుతాయి. బహుశాఉపద్రవకరమైనదికవడిగానే ఇంకాకష్టాలురావచ్చును" అనికూడ చెప్పబడెను.

"ఫ్రాంకో-జర్మన్ సమస్యకు సంపూర్ణమూ, సమూలమూఅయిన పరిష్కారం ఫిబ్రవరినెలాఖరులోగాకుదిరి అమలులోనికి రావలెను" అని హిట్లరు విషీప్రభుత్వానికి తెలియజేసివాడని తెలుస్తున్నది విషీప్రభుత్వం ఔననికాని, కాదనికాని నిష్కర్షగా చెప్పకుండా కాలం వెళ్ళబుచ్చుతున్నది-కాని ఈసారి జర్మనీకోరికలు అంత్యసందేశరూపంలో ఉన్నవి.

ఫిబ్రవరి౯వతేదిసాయంత్రం జరిగిన ఫ్రెంచి మంత్రివర్గసభలో అడ్మిరల్ డార్లాన్ పారిస్లో తనసంభాషణలమీద ప్రకటన చేసెను. లావల్ తనకు దేశీయాంగశాఖా మంత్రిత్వము కావలెనని అడిగెనట. కానిపోలీసుశాఖపై అధికారంఇవ్వ మనిరట.

(౧౦ వ పేజి చూడుము)

# సత్యాగ్రహ సభలో మేజిస్ట్రేటు ఉపన్యాసము

## గలెటీగారి రాజకీయప్రచారము

ఫిబ్రవరి ౧వ తేదిఉదయం ౯౼౧౨ గంటలకు గూడూరులో రామమందిరందగ్గర ఏనుగునరసారెడ్డిగారు రెండవసారి సత్యాగ్రహముచేయుటకు నిశ్చయించిరి. ఈరెడ్డిగారిదివరకొకసారి సత్యాగ్రహంచేయగా పోయిన నెల ౭వ తేదిన గూడూరుజాయింటు మేజిస్ట్రేటు గలెటీగారు వారినిశిక్షించక వదలిరి. మరలసత్యాగ్రహంచేయుటకు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘమువారు రెడ్డిగారికి అనుమతినిచ్చిరి. ఈసత్యాగ్రహసందర్భమున సభకు రామమందిరమునద్ద చాలమంది ప్రజలు చేరిరి. బెజవాడవారును ఇప్పుడుగూడూరులో ఉండువారును అగు ఎస్. వి రంగాచారిగారు సభకుఅధ్యక్షతవహించిరి. సత్యాగ్రహముచేయుటకు నిర్ణయించిన కాలానికి యింకనువ్యవధియున్నందున సభలో మొదట రంగాచార్యులుగారు యిట్లుఉపన్యసించిరి. "సత్యాగ్రహులమీద తేబడినకేసులను విచారణ చేయునప్పుడు గూడూరు జాయింటుమేజిస్ట్రేటు గలెటీగారు సత్యాగ్రహులను, సాక్షులను చాలాప్రశ్నలడుగుచున్నారు ఇవి కేసుకుగాని, సాక్ష్యానికిగాని సంబంధించినవికావు. ఇట్లు ప్రశ్నలడిగినప్పుడు కొందరు కొన్నిప్రశ్నలకు జవాబు చెప్పట, కొన్నిటికి చెప్పకపోవుట జరుగుచున్నది. అందువల్ల మేజిస్ట్రేటుకు సత్యాగ్రహులవిషయములో విపరీతాభిప్రాయములు కలుగుచున్నవి. తామునిరాకరణముల కాంగ్రెసుసిద్ధాంతములను అనుసరించుచున్నామని మేజిస్ట్రేటుకు నమ్మకంకలిగించడం సత్యాగ్రహుల విధికాదు. సత్యాగ్రహముచేయుటకు వీరికిఅనుమతినిచ్చిన కాంగ్రెసుసంఘమునకు మాత్రమే వీరుబాధ్యులు. విచారణసమయములో సత్యాగ్రహులు తామేప్రశ్నలకును జవాబుచెప్పమని మొదటనే మేజిస్ట్రేటుకు స్పష్టముగా తెలియజేయవలెను, లేదా మేజిస్ట్రేటు అడిగెడి ప్రతిప్రశ్నకు సరియైన జవాబుచెప్పవలెను అంతేగానికొన్నిటికి జవాబుచెప్పుట కొన్నిటికిజవాబు చెప్పకపోవుట మంచిపద్ధతికాదు" అనివారుచెప్పిరి. జనవరి౭వతేదిన తనమీద తేబడినకేసువిచారణలో జరిగినసంగతులను నరసారెడ్డిగారు సభలో తెలుపుచుండగా జాయింటుమేజిస్ట్రేటు గలెటీగారును వారి క్రింది ఉద్యోగులును అక్కడికి వచ్చిరి ఈసభలో నేనుకూడా మాట్లాడగోరినానని గలెటీగారు అధ్యక్షునితో చెప్పిరి. అధ్యక్షుడు అనుమతినిచ్చెను. ఇంకను రెండుమంది వచ్చుటకై గలెటీగారు మరికొంతసేపు నిరీక్షించి తరువాత ఉపన్యసించిరి.

### గలెటీగారి ఉపన్యాసము

"ఇండియాలో ఎక్కడగాని కాంగ్రెసువారేర్పరచినసభలలో ప్రభుత్వపక్షమువారు మాట్లాడిపుడలేదు. కాంగ్రెసుకు చేరినవారును, ప్రభుత్వోద్యోగులును ఒక్కసభలో మాట్లాడుట కిదే మొదటిసారి. ఇటువంటిఅవకాశమును నాకుకలిగించినందుకు నేను నరసారెడ్డిగారిని అభినందించుచున్నాను. గూడూరుపౌరులు కాంగ్రెసు పక్షమువారు చెప్పిన సంగతులను ప్రభుత్వపక్షమువారు చెప్పినసంగతులను విన్నతరువాతనే తమఅభిప్రాయమును నిర్ధారణ చేసుకొనుచుండగోరుదును. ౧౯౪౦ డిసంబరునెలలో సూళూరుపేటలో బి. వెంకటనారాయణరెడ్డిగారును, వెంకటగిరిలో కే. షణ్ముఖంగారును సత్యాగ్రహము జేసిరి, ఆ రెండుసభలలోను నేను మాట్లాడవలెననుకొంటిని. కాని పనితొందరవల్ల అది సాధ్యపడలేదు. సత్యాగ్రహులకేసులు విచారణకు వచ్చినప్పుడు కాంగ్రెసువారినిజాభిప్రాయమును తెలుసుకొనుటకొరకే నేనువారిని చాలాప్రశ్నలడుగుచున్నాను. వారిలోకొందరు మౌనము వహించుచున్నారు మరికొందరు జవాబులనుచెప్పినను ధారాళముగా నాతో చర్చించుటలేదు. నర్సారెడ్డిగారి కేసు విచారణకువచ్చినప్పుడు నేను రెడ్డిగారి మనస్సుకు చక్కగానాటునట్లు కొన్ని పరుషవాక్యములను చర్చించితిని. వాటికికూడా రెడ్డిగారు జవాబుచెప్పలేదు. రెడ్డిగారిని [illegible] కాంగ్రెసువారినిగురించి [illegible] కఠినవాక్యములను నేను పలికితినని రూఢియైనచో నేనువారికిక్షమాపణ తెలుపగలననియిదివరకేచెప్పియున్నాను. అసంగతిని యీసభలోమరలచెప్పుచున్నాను. రెడ్డిగారి కేసువిచారణసమయములో నేనన్నమాటలను గాంధిగారికి తెలియజేయగా, 'రెడ్డిగారు ౧౫రోజులపాటు నూలువడికితరువాత మరలసత్యాగ్రహము చేయవలెనని గాంధిగారువ్రాసినట్లునాకు తెలిసినది ఇదినిజమేనాఅని నేనురెడ్డిగారినడుగుచున్నాను" అనిగలెటీగారుప్రశ్నించగా, "ఇదినిజమే, గలెటీగారు ముమ్ములనుగురించి పరుషవాక్యాలను పలికినందుకు నాకువిచారములేదుకాని సర్వవిధములపూజనీయులైన భారతజాతీయనాయకులపై గలెటీగారు నిందలనుమోపినందుకుమాత్రం నాకుచాలవిచారముగానున్నది అని గాంధిమహాత్మునకువ్రాసినాడు. గాంధిమహాత్ముని ఆజ్ఞప్రకారము నేనిప్పుడు ప్రతిరోజూను నూలువడుకుచున్నాను." అనినర్సారెడ్డిగారుచెప్పిరి. పిమ్మట గలెటీగారు ఉపన్యాసమిచ్చిరి.

"రెడ్డిగారు ప్రతిరోజు నూలువడుకుచున్నారన్ననమ్మకం నాకుకలుగుటలేదు, నిష్కపటముగా పనిచేసెడివారిని నేనుగౌరవింతును. వంచకులైనవారిలోగుట్టునువెల్లడించి నేనువారిని పరిహాసపాత్రులనుచేసెదను. నాడివిజనులో ప్రజలుసర్వవిధములయుద్ధములోసహాయముచేయుచున్నారు, గాంధిగారు స్వయముగా యీడివిజనుకువచ్చి ఉపన్యాసములిచ్చినను ప్రజలిట్లు సహాయముచేయుటమానరు. కాంగ్రెసువారు రెడ్‌క్రాసునిధికి ధనమియ్యవచ్చునా అని నెల్లూరు జిల్లాజడ్జి ఐ. ఇ. వాకరుగారు గాంధీగారికివ్రాయగా దానికాక్షేపణలేదనిరి. గాంధిగారు ఆధ్యాత్మికసిద్ధాంతములో తనదీక్షనువదలడనుసంగతి అందరికిని తెలిసినదే. బ్రిటనులో క్వేకరులనే ఒకతెగవారున్నారు. వారుకూడా గాంధిగారివలెనే యుద్ధాలను నిరసింతురుకాని యుద్ధంలోబాధపడినవారిసహాయానికై వారుచాల ధనమిచ్చుచునేయున్నారు, గాంధిగారి అభిప్రాయముకూడాయిదే కాంగ్రెసువారు రెడ్‌క్రాసునిధికి ధనమియ్యవచ్చునని మహాత్ముడు మాక్‌గారికి వ్రాసినందుకు ఆంధ్రరాష్ట్రములో కాంగ్రెసువారికి చాలమందికి మహాత్మునిమీద కోపంవచ్చినది. మహాత్ముడిట్లుస్పష్టముగాచెప్పినను రాష్ట్రీయకాంగ్రెసు సంఘమువారు రెడ్‌క్రాసునిధికి ధనసహాయముచేయుటలేదు. కాంగ్రెసువారిలో నిష్కపటులైనవారు చాలకొద్దిగానున్నారు. హెచ్చుమందికి త్రికరణశుద్ధిలేదు మౌలానా అబుల్ కలాంఆజాదు, సి. రాజగోపాలాచార్లవంటి గొప్పనాయకులుకూడా తమప్రకటనలకువిరుద్ధముగానే పనిచేసిరి. నేను రెడ్డిగారికి శిక్షవేయను. వారు కాలినడకలో ఢిల్లీకి వెళ్ళవచ్చును." అని గలెటీగారు ముగించిరి.

పిమ్మట గలెటీగారు తనమీదచేసినఆక్షేపణలన్నిటికి ఆటుతర్వాత సభలో నరసారెడ్డిగారు జవాబుచెప్పిరి. "నేను నాఓపినభక్తితో కాంగ్రెసుకుసేవచేయుచునేయున్నాను. ఒక హాస్టలుకుగాని మరిఒకదానికిగాని ధనసహాయము చేయవలెనని నాకు గలెటీగారాజ్ఞాపించనక్కరలేదు. లోపాలను కనిపెట్టి గలెటీగారు గోరంతలను కొండంతలుగాచేసి చెప్పుచున్నారు" అని రెడ్డిగారనిరి. అంతసభలోనుంచివెళ్లుటకుగలెటీగారు లేచిరి. మీరుచితజ్ఞులగుటచే యీసభలో యితరుల ఉపన్యాసాలనువినుట ముఖ్యకర్తవ్యమై యున్నది" అని అధ్యక్షురంగాచార్యులుగారు గలెటీగారితో చెప్పిరి. అంతటగలెటీగారు మొదలైనవారందరు మరలకూర్చుండిరి. నరసారెడ్డిగారు ఉపన్యాసంసాగించుచు "ఇండియాలో దేశరక్షణవిషయములో ప్రభుత్వము సరియైన పద్ధతినవలంబించినచో మిక్కిలి తక్కువవ్యయముతో యిండియాలోపూర్తిగా భారతీయులతోనే కూడిన భారతీయసైన్య మీపాటికే సిద్ధమైయుండెడిది. బ్రిటిషువారికిప్పటికిని భారతీయులమీదనమ్మకం లేదు గలెటీగారుకాంగ్రెసువారిమీద నిందలను మోపుటవల్ల గలెటీగారి ఉచితజ్ఞతకు కూడా భంగముకలుగుచున్నది. నన్ను నేడు అరెస్టుచేయకపోయినచో గాంధిమహాత్ముని ఆజ్ఞప్రకారము నేడే నేనిక్కడినుండి కాలినడకను ఢిల్లీకిబయలుదేరగలను. నాఆస్తినంతయు యిక్కడనే వదలెదను అవసరము వచ్చినదాని నంతయు త్యజించుటకుకూడ నేను వెనుదీయను" అని నరసారెడ్డిగారనిరి.

### అధ్యక్షుని రిమార్కులు

అటుతరువాత రంగాచార్యులుగారు ఉపన్యసించిరి. గలెటీగారు నుడివిన ప్రతిఅంశానికిని వారు జవాబుచెప్పిరి. "సత్యాగ్రహము పూర్తిగా అహింసమీదనే ఆధారపడియున్నది. శత్రువులను జయించుటలో అహింసకుగల గొప్పశక్తి గలెటీగారికి తెలియదు. దౌర్జన్యమువల్ల దౌర్జన్యము కలుగుననుటకు యూరపులో తరుచుగా యుద్ధములు జరగుటయే ప్రత్యక్షనిదర్శనము యూరోపియుల కిప్పటికిని దౌర్జన్యముమీద నమ్మకముపోలగలేదు. అందువలనే వారు జాతిసమితిని త్రోసివేసినారు ఇటలీవారు అబిసీనియాను ఆక్రమించినప్పుడు అబిసీనియావారికి బ్రిటిషువారేమియు సహాయముచేయలేదు, బ్రిటిషువారు యూరపులో చిన్నదేశాలపట్లగూడ అంతేచేసిరి. ఆదేశాలనన్నిటిని జర్మనీనియంత వశపరుచుకొన్నాడు" అని రంగాచారిగారనిరి.

### ఢిల్లీ ప్రయాణము

తరువాత నర్సారెడ్డిగారు యుద్ధప్రతికూలకేకలువేసిరి. వారిని పోలీసువారు అరెస్టుచేయలేదు. ఈవారములో సత్యాగ్రహముచేసినను అరెస్టుచేయబడనిమరిముగ్గురును రెడ్డిగారును వెంటనే గూడూరునుంచి కాలినడకను ఢిల్లీకి బయలుదేరిరి. వారీరోజుసాయంకాలానికి మనుబోలుచేరిరి.

---

## భువనగిరి

### మద్యపానము- హత్యానేరము

(స్వ.వి.)  ౬-౨-౧౯౪౧ ఫ.

రాజపేట సంస్థానములో ౨౭ ఇస్ఫందారు శని వారము కొందరుబోయలు (బెస్తవాండ్లు) కులవృత్తిప్రకారము చేపలుపట్టుటకై పోయివచ్చుచుండగా; మార్గమధ్యమునకల్లుత్రాగి కలహముజరిగెను. పోచయ్యను లింగయ్య కర్రతో నెత్తిపై కొట్టుటచే తలపగిలి మరణించెను. ౨ ఫిబ్రవరి సోమవారము భువనగిరివైద్యశాలకు శవముతేబడెను. పరీక్షానంతరము శవమును భువనగిరిలోనే పూడ్చివేసినారు. హంతకుడు పారిపోయినట్లును వానితండ్రి సోదరునిహంతకునిజాడకై పోలీసులు పట్టుకొనినట్లును తెలియుచున్నది. చచ్చినవానివయస్సు సుమారు ఇరువదినాల్గుసంవత్సరములు. ఒకఆడశిశువు కలదు.

### బీబీనగరంలో దొంగతనాలు

(ఒకవిలేఖరి) బీబీనగరం, ఫిబ్రవరి ౬ ౧౩౫౦ ఫ. ఆదివారం రాత్రి బీబీనగరంలో మాగృహములో చోరులుపడి దాదాపు (౧౦౦౦)రూపాయల సువర్ణరజతాములు, మరియు వస్త్రములు అపహరించుకపోయిరి. దొంగతనము అయి యేడుమాసములువెళ్లెను. చోరులుమాత్రం బయలుపడలేదు. ఇదేగ్రామములో సుమారు అయిదారుసంవత్సరాలనుండి సుమారు నాలుగు అయిదు దొంగతనాలుఅయి సొత్తుకూడ ఎక్కువగాపోయియున్నది. ఈగ్రామములో దొంగతనము చేసేదొంగలుమాత్రం బైటపడుటలేదు. వేరేగ్రామాలలో మరియు రస్తాలలో దొంగతనముచేసిన దొంగలు కొందరుదొరికిరికాని మాగ్రామమువారిదురదృష్టము అనుకోవలసివచ్చుచున్నది.

## ఖద్దరుధారణకు నిరుత్సాహము

ప్రభుత్వమువారికి మనవి

తేది ౨౦-౧-౪౧న వరంగల్ నివాసి కంబళ్ల వర్తకులు శ్రీ సుసురు లోకనాధంగారును, నేనును జూబిలినగరం గొంగళ్లఖరీదుకై బయలుదేరి కరీంనగరంలో బస్సుదిగితిమి. అప్పటికొక సామాన్య పోలీసుఉద్యోగివచ్చెను నాపేరు అడ్రసుఅడిగి వ్రాసుకొనెను. అదిచూచి నావెంటనున్న శ్రీ లోకనాథంగారు 'నాపేరుఎందుకువ్రాసుకోరు' అనియడిగెను. అందుకతడేమి సమాధానముచెప్పలేదు, "ఖద్దరుగుడ్డలుధరించినందుకు నాపేరు వ్రాసికొన్నడు" అని నేనేసమాధానము చెప్పికొంటిని. ఖద్దరుగుడ్డలు ధరించువారియెడ యీప్రకారం వర్తించుటవల్ల అగుడ్డలువాడుట తగ్గిపోవుట సహజం. చేనేతపరిశ్రమప్రియులును దయామయులునగు మనప్రభువుగారును, ప్రభుత్వమువారును యిదితమదివ్యచిత్తమునకుదెచ్చి తగుసౌకర్యములొనరింతురని నమ్ముచున్నాము.

ఇట్లు,
గుంటక నరసయ్య,
నిజాంరాష్ట్ర చేనేతసభాకార్యదర్శి,
అ. భా. పద్మశాలి మహాసభకార్యదర్శి.

## ఓరుగల్లుజిల్లా ఆంధ్రజన సంఘకార్యకారిణీసభ

౨౮ ఇస్ఫందారు ౧౩౫౦ఫ. బుధవారము నాటిసభాచర్య

(విలేఖరి)

తాలూకాసంఘముల యభిప్రాయముప్రకారము శ్రీయుత మాదిరాజు రామకోటీశ్వర రావుగారికిని, శ్రీయుతపర్చా రంగారావుగారికిని యీదిగువప్రకారము అభిప్రాయములు వచ్చినవి,

శ్రీ మా. రామకోటీశ్వరరావుగారికిమధిర, మహబూబాబాదు,మానుకోట అం'సం. ఓరుగల్లు తాలూకా, ములగ్,

శ్రీ పర్చా రంగారావుగారికి ఖమ్మం, పాల్వంచ, ఇల్లెందు, పాఖాల, ఓరుగల్లుపురసంఘము.

సమానముగావచ్చిన యభిప్రాయములపై తుదినిర్ణయముస్థాయిసంఘమునకే యున్నదని మహాసభకార్యనిర్వాహక సభవారి తీర్మానానుసారము నిర్ణయమైనదిగనుక జిల్లాసంఘమువారే నిర్ణయించవలెనని తీర్మానింపబడెను.

సభ్యులలోనుండి కొందరుఆహ్వానసంఘమునకు యభిప్రాయమిచ్చు యధికారమున్నదా! లేదా! లేనియెడల నాయసంపించిన యధికారమును లె క్క చె ట్ట వ లె నా! లేదా! యనిప్రశ్నించిరి వాదోపవాదములైన పిదప నియమావళినసురించి తుదినిర్ణయమునిచ్చుటకు సభ్యులందరేకగ్రీవముగా శ్రీయుత ఆవంచ వేంకటరావుగారిని అధ్యక్షునిగా నెన్నుకొనిరి వారు నియమావళినసురించి ఆహ్వానసంఘమునకు ప్రత్యేకముగా యభిప్రాయమిచ్చు యధికారములేదుగనుక ఇంతకుముందు వారుపంపినయభిప్రాయమును గమనింపకుండుటకు నిర్ణయించిరి దీనితరువాత అధ్యక్షులఎన్నికను గురించి జిల్లాసంఘసభ్యుల యభిప్రాయము తీసికొననైనది శ్రీయుతపర్చా రంగారావుగారికి(౬)శ్రీయుతమాదిరాజు రామకోటీశ్వరరావుగారికి(౩)ఓట్లువచ్చిన విశ్రీయుత పర్చారంగారావుగారు బహుజనాభిప్రాయమునసురించి ద్వితీయజిల్లా మహాసభకు అధ్యక్షులుగా నెన్నుకొనబడిరి.

ఆహ్వానసంఘమువారు ద్వితీయజిల్లామహాసభకు స్థలము, తేదులు, మూడుదినములలోపుగా నిర్ణయించి తెలుపుటకును, ప్రభుత్వమువార అనుజ్ఞవిషయమున తగినచర్యతీసికొనుటకును కోరబడిరి.

తర్వాతివార్త

ఇపుడే మహాసభరాబోవు ఆర్దిబెహస్తు ౯, ౯,౧౦ తాతీఖులలో జరుగునని తెలిసినది.

## పాల్వంచ సంస్థానము

రివిన్యూ పోలీసు మంత్రిగారి దౌరా

(స్వ. వి.)

మనప్రభుత్వపు రివిన్యూపోలీసు మంత్రులగు టాస్కరుదొరగారు. లేడీటాస్కరుగారితోసహా ౨౭-౪-౫౦ తారీఖున పాల్వంచకు దయచేసి శ్రీ రాజావారి బంగళాయందు విడిదిచేసిరి. వీరుదయచేయగానే సంస్థాన రిజర్వు పోలీసువారు సలామీచేసెను కోర్టువాజరుగారు వీరివెంట నుండి సంస్థానోద్యోగీయుతెల్లగను పరిచయము గావించి మధ్యాహ్నం నూతనరాజధానీనగరమునకై కట్టబడిన కొత్తబిల్డింగులను, దమ్మపేట రోడ్డును పరిశీలించివచ్చిరి. ఇంజనీరుగారు, ఆర్చి టెక్టుగారు వెంటనుండిరి, మరునాడుయము బూర్గంపాడుమీదుగా నెల్లిపాకవెళ్లి అక్కడ చెరువును పరిశీలించి బయ్యారం జానంపేటనుకు వానసురియుచున్నను, దౌరాచేసి ౬-౫-౫౦ సాయంత్రం౩గంటలకు పాల్వంచకు దయచేసిరి. మరునాడు యిలందుతాలూకా రేగళ్లవద్ద ఏవిమోపా చీనస్థూపములున్నవని అక్కడకువెళ్లిచూచివచ్చిరి మట్టుప్రక్కల గ్రామములు కోయలు తమయిబ్బందులనుగూర్చి దరఖాస్తులు దాఖలుచేసుకొనిరి. టాస్కరుదొరగారు స్వయముగా వారలవద్దకు వెళ్లి వారికష్టసుఖములనడిగి తెలుసుకొనిరి ౪-౫-౫౦ తారీఖు ఉదయం భద్రాచలమునకు వెళ్లి దేవస్థానమును పరిశీలించి, అక్కడ జిల్లాకలెక్టరు. సలుకలెక్టరువారి యాతిథ్యమునుబొంది మోటారుపైన కూనవరంవెళ్లి లాంచీలపైన పాపికొండల దృశ్యములనుచూచుటకు పేరంటపల్లివెళ్లిరి. అటనుంచి, పోలవరం అశ్వారావుపేటల మీదుగా ఖమ్మంవెళ్లుదురని తెలియుచున్నది. వీరివెంట సంస్థానములో ౫, ౬ మాసములనుంచి అటవికజనజీవిత చారిత్రకపరిశోధకులు, విద్యావంతులగు హేమండాఫ్ దొరగారుకూడ నున్నారు.

### రాజధానీనగర ప్రారంభోత్సవము

పాల్వంచ సంస్థానమునకు ముఖ్యకట్టడముల తోనిర్మింపబడిన నూతన రాజధానీనగర ప్రారంభోత్సవము జర్గించుటకై ఫిబ్రవరి ౧౩వ తారీఖున మనప్రభుత్వసభాధ్యక్షులగు రైట్ ఆనరబుల్ సర్ అక్బరు హైదరిగారు దయచేయగలరు. వీరితోపాటు రివిన్యూడైరెక్టరుజనరల్ గ్రాఫ్టిగ్ దొరగారుకూడ దయచేతురని తెలియుచున్నది. వలయు ఏర్పాటన్నియు పూర్తిచేయ బడుచున్నవి. శ్రీరాజావారు ముందుగనే దయచేయగలరనుకొనుచున్నారు రాష్ట్రములోని ఉన్నతాధికారుల కాహ్వానములు పంపబడుచున్నవి. ఈమహోన్నతాధికారులరాకయు సంస్థానభావియాన్నత్యసుస్థిరత్వమునకు శుభసూచకములగునని జనులాశించుచున్నారు

### సబ్ పోస్టుఆఫీసు

పాల్వంచలో బ్రాంచిటపాఖానా ఉండెడిది. ఫిబ్రవరి౧నుంచి సబ్ఆఫీసు ఖాయంచేయబడి కొత్తమున్షీగారిని ఏర్పాటుచేసిరి ఈ టపాఖానాకు కొత్తపాల్వంచలో ప్రత్యేకించి బిల్డింగు కూడకట్టించబడినది టపాల్నాజరు గారువచ్చి తగినయేర్పాట్లుచేసి వెళ్ళిరి. సంస్థానములో దమ్మపేట బ్రాంచిటపాఖానా ఖాయపరుపబడినది. రుద్రంకోటవైపులోగూడ నొకటపాఖానా ఏర్పరచినచో చాలసదుపాయముగనుండగలదు. సంస్థానాధికారులు ఈవిషయమును గుర్తింతురుగాక.

### గురుస్వామి తహశ్శీలుదారుగారు

బూర్గంపాడునుంచి మార్చబడిన ఖాల్సా తహశ్శీలుదారు గురుస్వామి ఎం ఏ. గారికే తిరిగి యీతాలూకాకు తహశ్శీలుదారుగా పంపినందుకు అందరు సంతోషించుచున్నారు. వీరిమార్పుసందర్భమున ఎన్నెన్నోజల్సాలు, విందులు, టీపార్టీలు జర్గించపడినవి.





## మలేరియా జ్వరపీడితులకు తోడ్పడునది మంచి ఆహారమే

కఠినసమస్య జయింపబడినది. మలేరియా జ్వర బాధితులకు హార్లిక్స్ అమోఘమైన గుణము చూపెట్టునని డాక్టర్లు ఉత్సాహముతో చెప్పుచున్నారు. ఇది రోగికి శక్తినిచేకూర్చి బలముతగ్గకుండజేయును. జ్వరపువిషమునరస్నాయువులలోజొచ్చి వాటిని బలహీనముగాజేసి జీర్ణశక్తిని తగ్గించును కాబట్టి ఏఘనఆహారము సహించదు. హార్లిక్సు ఈ కష్టమును తొలగించును. ఇది వందకువంద పుష్టినిచ్చునది గాన జీర్ణశక్తికి హానికలుగనీయక పూర్తిగా జీర్ణమై సకలావయవములకు బలమునిచ్చును తేర్గవకాలమును తగ్గించును. ఇది ప్రతియింటిలో నుండవలసిన ఆహారము.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర మాఘ బ॥ ౨

గురువారము


# ఉస్మానియా విద్యాపీఠ నివేదిక.

ఉస్మానియా విద్యాపీఠముయొక్క నివేదిక ౧౩౪౯ ఫసలీ సంవత్సరముది ప్రకటింపబడినది స్థూలముగా విద్యాపీఠములో కళాశాలల అభివృద్ధి తృప్తికరముగాను అభివృద్ధి కరముగాను ఉన్నదని చెప్పవచ్చును.

నివేదికాకాలములో మ. ఘ. వ. నిజాంప్రభువుగారికి ౧౫ ౨౦౦ రూ॥ విలువచేయు ఉస్మానియా కాలేజీభవనము వెండినమూనా సిద్ధముచేసి సమర్పించుకొన్నారు. బికనీరు మహారాజులుంగారికి గౌరవ డాక్టరు బిరుదమిచ్చుచు వారి హిందూవిద్యాపీఠానికి ౧ లక్షరూపాయీల దానముచేసినారు. ఉ॥ విద్యాపీఠపు ఆచార్యులు భారతదేశములో జరిగిన వివిధ విద్యాసభలలో పాల్గొన్నారు. కాని ముల్కీ-భాషలవారును, సంస్కృతాదిభాషలవారును పాల్గొనినట్లు కానరాదు. క్రొత్తగా పి. హెచ్. డీ. డిగ్రీ ఏర్పాటుచేసినారు. డిగ్రీలుపొందిన విద్యార్థులు ౧౪౯. ఇతర ప్రాంతాలనుండి పండితులను పిలిపించి పరిశోధకోపన్యాసాలిప్పించినారు. ఈపద్ధతి బ్రిటిషిండియా అనుకరణము. ఒక్కొక్క ఆచార్యశేఖరునికి ఒక్కొక్క ఉపన్యాసానికి ఒక్కొక్కమారు ౧౦౦౦ రూపాయీలవరకుకూడా అచ్చుకొను పద్ధతికలదు. ఇట్టిఉపన్యాసాలలో ఒక్కొక్కమారు పదిమంది మాత్రమే శ్రోతలుందురు. కావున ఈ పద్ధతివలన లాభములేదు. దానిని వదలుకొనుట మంచిది.

నివేదికాకాలములోనే విద్యాపీఠ చరిత్రలో ముఖ్యఘట్టమగు వందేమాతరంకల్లోలము చెలరేగెను. దాని ప్రతిధ్వను లింకను వినవచ్చుచున్నవి. ఇదే నివేదికాకాలములో హైదరాబాదు నగరములో హిందూముస్లింకలహాలు సంభవించెను. "ఈకలహాలలో విద్యాపీఠపు విద్యార్థులెవ్వరును పాల్గొనలేదని చెప్పటకు సంతసించుచున్నాము" అని నివేదికలో వ్రాసినారు. విద్యాపీఠము విద్యార్థులలో సాంప్రదాయికబుద్ధి (communal ideas) లేకుండుటకు ప్రశంసించవలెను. అదేబుద్ధిపూర్తిగా వీరికి ఒంటబట్టియుండినచో వందేమాతరం గడబిడలుకూడ లేకుండెడివి. "ముస్లింవిద్యార్థులు వందేమాతరం గానమును ఆక్షేపించిరి" అని నివేదికలో వ్రాసినారు. "రంజానుపండుగలో రాత్రుళ్లలో ముస్లింవిద్యార్థులు అజాచేసి మాకు నిద్రాభంగము కలిగించినను మేమాక్షేపించితిమా" అని హిందూవిద్యార్థులు ఆగడబిడలకాలములో ప్రకటించియుండినట్లు మాకు బాగు జ్ఞాపకమున్నది. అది యతిశయోక్తియగుగాక. ఉభయవర్గాలలోని విద్యార్థులలో సహానబుద్ధి మొదటహాస్టళ్లలోనే పెంపొందవలెను.

నివేదికాకాలములో ఉ॥ విద్యాపీఠములో మొత్తము కళాశాలలలో ౧౮౮౮ మంది విద్యార్థి విద్యార్థినులుండిరి. విద్యార్థుల ఆరోగ్యాభివృద్ధికి ఆటపాట లేర్పాటుచేసినారు. కాని అవన్నియు పాశ్చాత్యఖేలనా పద్ధతులుగా కనబడుచున్నవి. హిందీ కస్రతునకు అవసరమగు దంగల్, ముగ్దర్ మున్నగుసాధనాలనుకూడ ఏర్పాటుచేయవలెను. మన కస్రతే ప్రపంచములోనెల్లను అగ్రస్థానమువహించినది. ఉస్మానియాకళాశాలలోని గ్రంథాలయములో ౭౭౮౭౯ గ్రంథాలున్నవన్నారు. వరంగల్, గుల్బర్గా, ఔరంగాబాదు కళాశాలలలోను, నగరములోని యితర కళాశాలలలోను ఎన్నిగ్రంథాలున్నవి. ఉన్నగ్రంథాలయములలో వివిధభాషలలో అనగా ఇంగ్లీషు, ఉర్దూ, తెనుగు, మరాఠీ, కన్నడము, అరబీ, ఫార్సీ, సంస్కృతము — ఈభాషలలో ఎన్నెన్ని గ్రంథాలున్నవో ఆపట్టికను వేరువేరుగా చూపించితే బాగుంటుందని సూచించుచున్నాము.

విద్యార్థిసంఘము ఉ॥ వి॥ పీ॥ కళాశాలలో ఉన్నదని తెలిపినారు. ఇటీవల ఈసంఘపు ఎన్నికల విషయమై కొంత మనస్తాపాలు కలిగినట్లు వింటిమి. సాంప్రదాయకబుద్ధి లేకుండునట్లు రుజువు చేయుటకు ఈసంఘము ఎంతైనను పాటుబడుట కవకాశమున్నది. నేటివరకు ఏయే వర్గాలవారు అధ్యక్షులుగా ఉండినారో తెలుపుటబాగుండును. అలీఘరు పూర్తిగా ముస్లింవిద్యాపీఠముకదా! అచ్చట హిందువులకు అలీఘర్‌వారి అనుగ్రహముచేతమాత్రమే స్థానము దొరకును అట్టిచోట ఇంతవరకు విద్యార్థిసంఘములో కొందరుహిందువులు అధ్యక్షులైనట్లు మాకుజ్ఞాపకము, మరి ఉ॥విద్యాపీఠ విద్యార్థిసంఘములో ఇంతవర కొక్క హిందువుకూడ అధ్యక్షుడైనట్లు కానరాదు- అర్హతలేకుండిన చింతలేదు. అర్హతఉన్ననాడే అవకాశమిచ్చుట మంచిపద్ధతి. కేవలము అర్హతనే దృష్టిలో నుంచుకొనినచో మాకు లవమాత్రము కూడ ఆక్షేపణముచేయుటకు అధికారముండదు.

ఉ॥ వి॥ విద్యాపీఠములో హిందీకి స్థానమిచ్చినట్లు నివేదికవలన కనబడుచున్నది. రాష్ట్రీములో ఉస్మానియా కళాశాలలలోచదువు విద్యార్థినులు ౯౩ మాత్రమే. ఇదిచాలాశోచనీయ స్థితిగా ఉన్నది. దీనికికారణమేమో ప్రభుత్వమువారు బాగుగావిచారించిజేసి ముందు ఇంతకు పదంతలైనను సంఖ్యపెరుగునట్లు చూడవలెను.

మరాటీభాషనుగురించిన గ్రంథాన్ని ఒకదానిని ప్రచురించుటకు రు.౪౦౦ ఇచ్చినారు. తక్కిన కన్నడము తెనుగు వాటికికూడా అట్టిపాకర్య ముండవలెను. ఉర్దూలోకొన్ని పదాలు వంగడసృష్టించినారు. పదానికొక్క ౧౫౦-౧౦ ప్రకారము వ్యయముచేసినారు "మజుముయులీ ము సిన్నఫీనెజిసాం "కమిటీపనికీగాను ౫ వేలు ఇచ్చినారు. ఇక పాఠ్యపుస్తకాలను మరియు ఇతరశాస్త్రగ్రంథాలను ఇంగ్లీషునుండి ఉర్దూలోనికి అనువదింపుచున్న దారుత్తర్జుమా సంఘము మామూలుగానే పనిచేయుచున్నది. ఇంతవరకు దానికొరకు ... లక్షలవరకు...

డ్లకు ఏటేట ౬౬౦౦ రూ. ఇచ్చినారు "దాయిరతుల్‌మారిఫ్"అనుసమితి అరబీ ఫార్సీ ప్రాచీనగ్రంథాలను పరిష్కరించి ప్రచురించు పనిచేయుచున్నది.

సంస్కృతములో బన్‌హట్టా (Ban-hatta)ను గురించి సంస్కృతపండితుడు ఒకపరిశోధక వ్యాసమును చదివినారట. ఇది అపూర్వమగు విషయము నేటివరకు సంస్కృతములో"బన్‌హట్టా" అనేపేరు వినలేదు. ఇది గ్రంథముపేరా కవిపేరా లేక పక్షిపేరా తెలియరాలేదు. సంస్కృతపండితులు తమకు తెలిసినచో తెలుపుదురుగాక. లేక ఉ॥వి॥ పీ॥ తపండితులే దీనివివరణ పత్రికలలో వ్రాసి సాంస్కృతీకులమనస్సుల నానందింపజేతురుగాక. అన్నికళాశాలలపైకి వరంగల్‌కళాశాలపైననే తక్కువ వ్యయముచేసినారు. 33 వేలచిల్లరపైకమును మాత్రమే ఖర్చుచేసినారు.

మొత్తముమీద ఉస్మానియావిద్యాపీఠాభివృద్ధి క్రమక్రమముగా హెచ్చుచున్నందులకు దేశీయులు చాలసంతోషించగలరు.

## జనపరిగణనప్రబోధములు

హైదరాబాదు కిషన్‌గంజి, ౬-౨-౪౧

శ్రీ సనాతనధర్మమహాసభాపక్షమున పండితు శ్రీ కే. విశ్వనాథశర్మగారి యాధిపత్యమున హైదరాబాదు (దక్కన్) నగరంలో కిషన్‌గంజిలో శ్రీశూన్‌సేటు పుష్పల రాజేశంగారి కాంపౌండులో ౬-౨-౪౧నాడొకసభ జరుపబడెను.

అందుమహాసభాప్రచారకులగు శ్రీవిద్వాన్ ఎస్. విశ్వేశ్వరశాస్త్రి, శ్రీసాహిత్యశిరోమణి డి. శేషగిరిశర్మ, శ్రీఉ.భా.ప్ర జి. పూర్ణచంద్రశర్మగార్లు ఉపన్యసించిరి

"ఆర్యసమాజికులు "ఆర్య"శబ్దమును సాధనముగ గైకొని కపటమార్గమున తమఅల్పసంఖ్యను అధికసంఖ్యగాజేసికొనుటకై పాటుబడుచుండుటను హిందువులెల్లరును జాగ్రత్తతో గుర్తింపవలెను. పదిసంవత్సరములకొకతూరి గ్రహింపబడు ఈజనపరిగణనసందర్భమున తమతమ జాతిమతభాషలను ఉన్నవున్నట్లుచెప్పిరక్షించుకొనుట ప్రతిమనుష్యునకును అవశ్యకర్తవ్యమైయున్నది, కావున తమతమ "హిందూ"మతమనియు, బ్రహ్మక్షత్రియవైద్యశూద్రాదిస్వీయవర్ణములను-ఆంధ్ర కర్ణాటకాదిస్వీయమాతృభాషలను స్పష్టముగవ్రాయించవలెను". అనిప్రబోధించుతీర్మానము సభాసదుల కరతాళధ్వనులచే నామోదించబడెను.

ఫిబ్రవరి ౪వతేదిసాయంకాలము హైదరాబాదు (దక్కన్) నగరమండలి గౌలిగుడెములో హిందూప్రజామండలిశాఖవారి యాజమాన్యమున శంకరరావుబోర్గావ్‌కరుగారి అధ్యక్షతలో నొకసభజరుపబడెను. ఆర్యసమాజీయులును, సనాతనులునుకూడ ఈసభకువచ్చియుండిరి హిందువులఅధికసంఖ్యను తెగలభేదములుచేసి తగ్గించుటకై ప్రయత్నాలు జరుగుచున్నందున అధికసంఖ్యనుతగ్గించకుండనుంచుటకై ప్రభుత్వమువారు అనహిందువులను, అడవిజాతులవారలను వేర్వేరు తెగలుగాక నియుక హిందువులనుగా లెక్కించవలెననియు, హిందువులు అనగా భరతవర్షముతమ దేశమనిభావించువారు ఆర్యసమాజీయులైనను, జైనులైనను, బౌద్ధులైనను హిందువులనివ్రాయించవలెననియు, తెగభేదములనుచెప్పి వ్రాయించెడివారలు ఆభేదములతోపాటు హిందూశబ్దమును చేర్పించదగుననియు మాతృభాషేతరభాషలస్థానములో హిందూస్థానిఅనిగాని, ఉర్దూ అనిగాని వ్రాయించక హిందీఅనివ్రాయించవలెననియు తీర్మానముజమోదించబడెను.

ఫిబ్రవరి ౬వతేదిసాయంకాలము హైదరాబాదు (దక్కన్), సుల్తానుబజారు ఆర్యసమాజమందిరంలో సభజరిగెను పండిత మహేంద్రప్రతాపశాస్త్రి, పండితు బౌదుబిహారిలాల్, పండిత నరేంద్రసక్సేనా గార్లు జనపరిగణనమునుగురించి ఉపన్యాసాలిచ్చిరి. సక్సేనా గారుజనపరిగణనలోకొన్ని తప్పులనుగురించిచెప్పిప్రభుత్వమువారు అట్టివిజరుగనీయకుండచేయవలెనని చెప్పిరి. ఆర్యసమాజీయులు తమతెగను ఆర్యులనివ్రాయించుకొనవలెననికోరిరి.

## పర్కాల-తాలూకా ఆంధ్రజన సంఘస్థాపన

నీలినగర్, ఫర్వరి ౩

(స్వ-వి.)

తేది ౫-౨-౪౦ గురువారమురోజు పగలు రెండున్నర గంటలకు ఎరుగని నారాయణగారి గిర్నిలో సభసమావేశమాయెను? సభకుకందకుపైగా జనులువచ్చిరి. చుట్టుపట్లగ్రామాలనుండి పెద్దపెద్ద రైతులు సభలోపాల్గొనిరి హైదరాబాదు (దక్కన్) నుండి ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీయుత మందుముల రామచంద్రరావుగారు శ్రీ బూర్గుల రామకిషన్‌రావు ఆత్రాఫుబల్దాజిల్లాసంఘకార్యదర్శియగు శ్రీడి రామారెడ్డి, యామజాల రాఘవరెడ్డి. శ్రీయాదయ్యగుప్తాగార్లును, సికింద్రాబాదునుండి వట్టికోట అళ్వారుస్వామి, శ్రీ సాళ్వేరు రామయ్యగార్లును వచ్చియుండిరి. ఆంధ్రమహాసభకార్యనిర్వాహకసభ్యుడు, శికింద్రాబాదు కంటోన్మెంటుబోర్డు సభ్యుడునగు శ్రీ సాళ్వేరు రామయ్యగారిని నేటిసభకు అధ్యక్షునిగాయుండవలయునని డి. రామారెడ్డిగారు కోరిరి, దానిని శ్రీ రావి నారాయణరెడ్డిగారు బలపరచిరి. రామయ్యగారు అధ్యక్షపీఠమలంకరించుచు తాలూకాసంఘము స్థాపించుచున్నందుకు సంతోషముతెలబుచ్చిరి తరువాత ఆంధ్రమహాసభాధ్యక్షులవారు ఒక గంటకాలము ఆంధ్రోద్యమమునుగురించి ఉపన్యసించిరి. తరువాత శ్రీ రావి నారాయణరెడ్డిగారు తాలూకాసంఘము మంచిదృక్పథముతో పనిజేయవలయుననివివరించిరి: శ్రీబూర్గుల రామకిషన్‌రావుగారు మాట్లాడుచు ౧౩౩౧ ఫసిలీలో హైదరాబాదు నగరమున ఒకచిన్నగదిలో పదిపన్నెండుమందిగల సమావేశములో ఆంధ్రమహాసభను స్థాపించియుంటిమనియు, మహాసభక్రమేణ అభివృద్ధిజెందుచు ఈనాడుఇక్కడ తాలూకా సంఘము స్థాపించుస్థితివచ్చినందుకు అభినందించిరి.

శ్రీరావి నారాయణరెడ్డిగారు అధ్యక్షులు,
,, కాలేరు సుదర్శనంగారు ఉపాధ్యక్షులు,
,, ఎరుగని నారాయణగారు కార్యదర్శి,
,, గాదె రాందాసుగారు సహాయకార్యదర్శి,
,, చామల రాజయ్యగారు కోశాధిపతి.

మరి ౭గురు సాధారణసభ్యులుగల కార్యనిర్వాహకవర్గమెన్నుకొనబడెను

తరువాత అధ్యక్షులవారి అంత్యోపన్యాసముతో సాయంత్రము ఆరు గంటలకు సభముగిసెను- అంతనాయకులు ఇక్కడిప్రజలచేత నడిపించబడుచున్న బాలికాపాఠశాలను చూచిరి. వచ్చినవాయకులు ఫలాహారములుజేసి సాయంత్రము ఏడు గంటలకు స్వస్థానాలకువెళ్లిపోయిరి,

## జనపరిగణన సందర్భంలో ఆర్య ప్రచారము

(ఒక విలేఖరి) పర్కాల, ఫర్వరి ౪

జనపరిగణనసందర్భంలో ఆర్యులనగా నేమో. వైదికధర్మమనగా నేమో ప్రచారముచేయుటకై వరంగల్లుజిల్లా ఆర్యోపదేశకులగు పండిత రుద్రదేవుగారును పర్కాలఆర్యసమాజమంత్రియగు కటుంగూరుకేశవరెడ్డిగారును పోయినశుక్రవారం ౩౧వ తేదినుండి ౩౦వతేదివఱకు దమ్మన్నపేట, తిర్మలగిరి, రేగొండ, లక్ష్మీపురం గ్రామాలలో సంచారముచేసి, ఉపన్యాసాలిచ్చిరి. మధ్య నారాయణపురములో అక్కడిప్రముఖులు లేనందున అక్కడమాత్రము ఏమియు చేయలేదు.

## మున్నూరుకాపుసంఘము

(యాకుతుపురము)

హైదరాబాదు (దక్కన్). ౬ ఫర్వరి ౧౯౪౧

శ్రీవిక్రమనామ సం॥ మాఘశు॥౧౧ శుక్రవారం ఉదయము ౭ గంటలకు శ్రీకన్యకాపరమేశ్వరిదేవాలయము యాకుతుపురంలో మున్నూరుకాపులసోదరులెల్లరు సమావేశమై ఏకీభవించి పైసంఘస్థాపనజరిపి యీక్రిందివారిని కార్యకారిణీసంఘముగాఎన్నుకొనిరి.

౧. పుడిగల నారాయణస్వామి గారు అధ్యక్షులు
౨. చాకపూర శ్రీరాములు గారు ఉపాధ్యక్షులు.
3. పట్నాల పెంటయ్యగారు కార్యదర్శి.
౪. పడాల వెంకటస్వామిగారు స, కార్యదర్శి.
౫ తోట రామస్వామి గారు కోశాధ్యక్షులు.
మరి ౫ గురు సాధారణసభ్యులు.

## పండిత్ నరేంద్రజీగారు

పండిత్ నరేంద్రజీ గారు కరీంనగరు, ఆదిలాబాదు, జిల్లాలలో గానున్న ఒకానొకెక్కల బాబులలో ప్రచారము చేయుటకై సంచారము చేయుచున్నారు.

## వివాహ సందర్భమున సభ

(విలేఖరి) హనుమకొండ, ఫర్వరి ౫

మాఘ శు ౩ సోమవారము శ్రీయుత పింగిలి శ్రీనివాసరెడ్డిగారి వివాహసందర్భమున శ్రీయుత గార్లపాటి రాఘురెడ్డిగారి అధ్యక్షతన యీక్రిందితీర్మానము అంగీకరింపబడినది.

"హైదరాబాదుశాసనసభలో ౧౩౩౯ ఫసలీలో కీర్తిశేషులైన పండితకేశవరావుగారిచే ప్రవేశపెట్టబడిన "బాల్యవివాహనిషేధపుబిల్లు" ౧౧సంవత్సరములతరువాత మొన్నడిసంబరు ౧౦వతారీఖులో నిరాకరింపబడినది ప్రజాభిప్రాయమెట్టిదైనది శాసనసభవారు సరిగాగమనింపకయు తెల్లడింపకయు ఇట్లుచేసిరని ఈసభవారు అభిప్రాయపడుచున్నారు. కావున మ. ఘ. వ. శ్రీ నిజాంప్రభువువారు తప్పకతమఫర్మాను ముబారకుద్వార ఈబిల్లునుత్వరలో అమలులోనికి తెప్పింప ప్రార్థితులు"

శ్రీయుత పింగిలి శ్రీనివాసరెడ్డిగారి వివాహమునకు స్థానికమునుండి విద్యార్థులు, యువకులు, పండితులు మడిపెల్లికివెళ్ళిరి. వారి బంధువులుగూడ చాలామందివచ్చిరి. సోమవారము (తం ౨-౫-౪౦) మధ్యాహ్నము శ్రీయుత గార్లపాటిరాఘువరెడ్డిగారి యధ్యక్షతన పెద్దసభఏర్పాటు చేయబడినది. పండితజయదేవుగారు (విద్యాలంకార) "ఆర్యసమాజమనగనేమి?" అనువిషయమునుగురించి బోధించుచుప్రస్తుతము జరుగుచున్న జనపరిగణనసందర్భమున జాతి ఆర్యజాతియనియు, ధర్మము వైదికధర్మమనియు, సార్వజనిక భాష హిందీయనియు వ్రాయించుటకు కారణములు విపులముగా తెలియబరచిరి.

పండిత రుద్రదేవుగారు (ఆర్యసమాజప్రచారకులు) మనసాంఘికదురాచారముల చూపించుచు అస్పృశ్యతానివారణ ఆవశ్యకతను తెలియబరచి ముఖ్యముగా బాల వివాహముచే గలుగుచున్న నష్టములచూపించిరి.

శ్రీయుత గంగుసత్యనారాయణగారు మనదేశదారిద్ర్యమునకు కారణము దేశీయపరిశ్రమలు క్షీణించుటయేయనిరి. మన ఆర్థికావస్థదూరముగావలెనన్న చేతిపరిశ్రమల అభివృద్ధిజేసి ముఖ్యముగా మనమందరము ఖద్దరు ధారణము చేయవలెనని సభికులనందరిని ప్రార్థించిరి. మనదేశీయపరిశ్రమలయం దభిమానమువహించి వానినే వాడవలయునని చెప్పిరి.

అనంతరము పై తీర్మానము ఏకగ్రీవముగా నంగీకరింపబడినది.

శ్రీయుత గార్లపాటి రాఘువరెడ్డిగారు ఇట్టి వివాహసందర్భములలో నిట్టిసభల నేర్పాటుచేసి మనసాంఘిక, ఆర్థిక అవస్థదూరముచేయుటకు బోధించుచుండవలయునని శలవిచ్చిరి.

## క్షయరోగం

హైదరాబాదు (దక్కన్) ఫర్వరి ౧౦ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు.

క్షయరోగం మొదట ఆగమిపందిలోఉండేది కోయలలోనే ఎక్కువ అదియిప్పుడు చుట్టుపట్టు గ్రామాలలో వ్యాపించుకున్నది. వరంగల్, ఆదిలాబాదు, కరీంనగరం, మహబూబునగరు జిల్లాలలో ౭౭౭ గ్రామాలలో ఈరోగంవ్యాపించినదని తెలిసింది. "థరోయాసర్స్లైన్" అనేమందుదీని పైచాలాబాగాపనిచేస్తుంది. ౧౦౫౧౭ మందికి ఈమందిచ్చిచూడగానూటికి ౭౦ మందికిబాగైంది. ఒక్కొక్కని చికిత్సకు ౧-౧౧-౦ పట్టును. ఈజాడ్యం అంటుజాడ్యం. అందుచేతమందికందకన్నిపూర్తిచికిత్సచేయుటకు ప్రభుత్వంవారేర్పాటుచేసినారు

## గౌ. సయ్యద్ అబ్దులజీజుగారు

గౌరవనీయులగు సయ్యదబ్దులజీజు మంత్రిగారు స్వదేశమగు పాట్నాకువెళ్ళి మొహర్రంకాలము అచ్చటగడిపి తిరిగి హైద్రాబాదుకు విజయంచేసినారు.

## ముస్లింపంచాంగము.

హైద్రాబాదు మతశాఖామంత్రిగారగు గౌ॥ సయ్యదబ్దులజీజు గారు ఒకఆలోచన చేసినారు. అదేమనగా ఇదివరకు ముస్లిములు తమపండుగలను క్రొత్తచందమామ దర్శనముతో ప్రారంభించుచున్నారు. కొన్నిప్రాంతాలలో చందమామ కనబడి కొన్నితావుల కనబడకపోవుటచేత ఒక్కొక్కప్రాంతంలో ఒక్కొక్కదినం వ్యత్యాసంతో పండుగ అయ్యేది. అటుకాకుండా మొత్తం ఇండియాముస్లిములను ఒకేదినంనాడు పండుగలు చేయుటకు హైద్రాబాదులో ఏర్పాటుచేయగలరు. హైద్రాబాదు నిర్ణయమును రేడియోద్వారా అఖిలభారతదేశానికి తెలుపుతారు.

# కాంగ్రెసుసత్యాగ్రహము

## గాంధిమహాత్మునిఆజ్ఞలు

గాంధిమహాత్ముడు ఢిల్లీరాష్ట్రీయ కాంగ్రెసు సంఘకార్యదర్శికి వ్రాసినలేఖలో "నాకాయ శక్యమున్నంతకాలము యిపుడు జరుగుచున్న సత్యాగ్రహోద్యమము సమిష్టిసత్యాగ్రహంగా మారునని భారతీయులెవరును కలలోనైనను అనుకొననక్కరలేదు. భారతీయులందరును సత్యాగ్రహికుండవలసిన లక్షణాలు సంపాదించవలెననే నేనుకోరుచున్నాను ప్రతిసత్యాగ్రహియు తానొక నాయకుడనని తెలుసుకొని ప్రవర్తించవలెను. నేనుఅరెస్టయినచో జాతీయసంరంభవిషయంలో సంపూర్ణబాధ్యతవహించుటకుసిద్ధముడవలెను.

"సత్యాగ్రహముచేసి జైలుకుపోవువారు మాత్రమే దేశసేవచేయుచున్నారనుకొనుటతప్పు.వ్యవధియున్నప్పుడెల్ల నూలువడుకుచు కాంగ్రెసుని ర్మాణకార్యక్రమమును అనుసరించువారు జాతీయోద్యమానికి యెంతో తోడ్పడినవారగుదురని నాఅభిప్రాయము'అనివ్రాసినారు.

ఢిల్లీరాష్ట్రకాంగ్రెసు సంఘాధ్యక్షుడుసత్యాగ్రహులపట్టికను మహాత్మునిఅంగీకారమునకై తీసుకొనిరాగా అపట్టికలో సుమారు ౪౦ పేర్లుఆమోదింపబడెను సంయుక్తరాష్ట్రకాంగ్రెసుసంఘాధ్యక్షుడుకూడ గాంధిమహాత్మునిచూచిసత్యాగ్రహులపట్టికనుసమర్పించగా అందులోనుంచి కొందరిని మహాత్ముడంగీకరించెను. సం.రాష్ట్రనిమరొకసత్యాగ్రహపట్టికతయారగుచున్నది.

ఢిల్లీరాష్ట్రకాంగ్రెసు సంఘాధ్యక్షునితోను. సం-రా-కాం-సంఘాధ్యక్షునితోను గాంధిమహాత్ముడుమాట్లాడుచు సత్యాగ్రహులెంతమంది సిద్ధముగానున్నారనునది ముఖ్యముకాదనియు గుణముముఖ్యమనియు అవిషయమై శ్రద్ధవహింపవలెననియుచెప్పిరని తెలుస్తుంది. ఈసంరంభము చాలాకాలముజరుగునట్లు ఉండుటచేత సత్యాగ్రహులను నిర్ణయించుటలో యెంతకష్టాలకైనను, త్యాగానికైనను సిద్ధముగాఉండేవాళ్ళనుగట్టివాళ్ళను నియమించవలెననికూడా వారు తెలియజేసిరి సత్యాగ్రహులెవరైనను విడుదలయినచో వారుయీఉద్యమము జరుగుతున్నంతకాలముతిరిగి సత్యాగ్రహముచేయుటకుసిద్ధముగాఉండవలెననికూడచెప్పిరి.

## సత్యాగ్రహంలో ఆంధ్రులఅగ్రస్థానము

'ఉద్యమము కొనసాగుచున్నవిధము చాల సంతృప్తికరంగానున్నది. మీరాష్ట్రమేఅగ్రస్థానము వహించుచున్నది. అనిగాంధిమహాత్ముడు తనవారము శ్రీ కళా వెంకటరావుగారు (ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘకార్యదర్శి) చూడబోయినపుడు నుడివినట్లుతెలియుచున్నది.

## భారతఅసెంబ్లీలో అడ్జరనుమెంటు తీర్మానము

'ప్రభుత్వమువారు దేశరక్షణనియమాలక్రింద సత్యాగ్రహముచేసిన కాంగ్రెసువారికి శిక్షలువేయుటఅక్రమము" అనువిషయమునుగురించి చర్చించుటకు ఇండియా అసెంబ్లీసభను అడ్జర్ను చేయవలెననే తీర్మానమును వుపపాదించెదనని కాంగ్రెసుసభ్యుడు మహమ్మదు కాజిమి గారునోటీసుయిచ్చినారు.

## మూడోమారు అరెస్టు

మధ్యరాష్ట్రములో ఫిబ్రవరి ౬ వతేది శ్రీ వి.యస్.జకతువార్ యం-యల్-ఏ-గారు నందారాలో మూడవమారు సత్యాగ్రహంచేసినందుకు అరెస్టుచేయబడిరి. అమరావతిపట్టణకాంగ్రెసుకార్యదర్శి శ్రీ హెరాతి సాకాలే గారికి దేశరక్షణనిబంధనలక్రింద ౬ నెలలకఠినశిక్షవిధింపబడెను.

శంకరరావు బభూల్కరు గారు సత్యాగ్రహంచేసినందుకు ఫిబ్రవరి ౫వతేదిన నాలుగుమాసముల శిక్షవిధింపబడెను. బభూల్కరుగారు సత్యాగ్రహంచేసి శిక్షపొందుటకిది రెండవసారి. వర్ధాపట్టణకాంగ్రెసు సంఘాధ్యక్షుడగు చంపకలాలు సోకలుగారిని అరెస్టుచేసిరి

పంజాబురాష్ట్రంలో కర్నాల్ జిల్లా కాంగ్రెసుకమిటీ కార్యదర్శి శ్రీ పి. చౌదరీమహమ్మద్ హుసేను గారికి ౬ నెలలకఠినశిక్ష, రూ ౨౫౦లజుర్మానా. దానిచెల్లించనియెడల మరొకనెల శిక్షవిధింపబడెను.

పంజాబురాష్ట్రంలో జలంధరు కాంగ్రెసువారి శ్రీ ఖరెయిటి రామ్ గారు సత్యాగ్రహనేరమునకై ౧ సంవత్సరము కఠినశిక్ష, ౧౫౦రూపాయలు జుర్మానా, దానిచెల్లించనియెడల మరి ౬ నెలల శిక్షవిధింపబడిరి,

## హెచ్చరికతో వదలుట

బెంగాలురాష్ట్రంలో యుద్ధప్రతికూలపు కేకలువేసినందుకు పూరీపట్నంలో (ఒరిస్సా) రఘునాథపారోహితుగారిని అరెస్టుచేసిరి. నౌగాంగులో (అసాము) భూరగానులో సత్యాగ్రహము చేసినందుకు దేవేంద్రవత్తశర్మ గారిని అరెస్టుచేసిరి. కాని అజిల్లాకలెక్టరు అసిస్టెంటు సీనియరుకమిషనరు వార్నింగుఇచ్చి వదలివేసిరి.

బెంగాలురాష్ట్రంలో సత్యాగ్రహ నేరమునకై ఫిబ్రవరి౫వతేది అరెస్టుచేయబడిన అఖిలభారత ట్రేడుయూనియను కాంగ్రెసుపూర్వాధ్యక్షుడగు డా॥ సురేశచంద్ర బెనర్జి [యం యల్ ఏ గారుమర్నాడు అలిపూరులోని సదర్ సబ్ డివిజనలు ఆఫీసరుయెదుట హాజరుపెట్టబడిరి. వారిపై దేశరక్షణ నిబంధనలక్రింద యుద్ధప్రతికూల ప్రసంగంచేసిన నేరమారోపింపబడెను. అనేకసాక్షులను విచారించినమీదట కేసు౧౦వ తేదివరకు వాయిదావేయబడెను ఫెనిలో శ్రీ మతిస్నేహమయి దత్తు గారికి కోర్టుముగిసేవరకు శిక్ష. రూ ౨౦ జుర్మానావిధింపబడెను. బర్ద్వానులో శ్రీమతి ౫ర మాదేవి గారు కుల్నే గ్రామంలో సత్యాగ్రహంచేసినను అరెస్టు చేయబడలేదు

## ఆనరరీ మేజిస్ట్రీటు రాజీనామా

సంయుక్తరాష్ట్రంలో కాన్పూరుగౌరవమేజిస్ట్రేటు సుందరలాల్ జైయినుగారు అఉద్యోగమునకు రాజీనామానిచ్చిరి. ఆయనసత్యాగ్రహప్రతిజ్ఞగైకొనినట్లున్ను, గాంధిమహాత్ముని అంగీకారం రాగానే సత్యాగ్రహం చేసేటట్లున్ను తెలుస్తున్నది.

సంయుక్తరాష్ట్రంలో ఫిలిభిత్జిల్లా కాంగ్రెసు తాత్కాలిక అధ్యక్షుడు శ్రీరామగుప్తా గారికి ౬ నెలలశిక్ష రూ౩౦౦జరిమానా దానిని చెల్లించనియెడల మరి౩నెలల శిక్ష విధింపబడెను.

అల్మోరాజిల్లా కాంగ్రెసు తాత్కాలిక అధ్యక్షులు శ్రీ ఈశ్వరదత్తపతిగారికి రెండునెలలవిడిశిక్ష రూ౫౦౦జరిమానా దానిని చెల్లించనియెడల మరిరెండువారాలశిక్ష విధింపబడెను.

తానా కాంగ్రెసుకమిటీ కార్యదర్శి శ్రీ జగదీశ నారాయణ్ సింగుగారు సత్యాగ్రహం చేసినందుకు ౧సం॥కఠినశిక్షవిధింపబడిరి. అజ్మీరు మార్వారా రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి శ్రీ బిషంబరనాథ్ భార్గవా గారు ఫిబ్రవరి ౬వతేది అరెస్టుచేయబడిరి.

బొంబాయిరాష్ట్రంలో సత్యాగ్రహంచేసినందుకు బెల్గాంజిల్లాలో ఫిబ్రవరి ౪వతేదివరకు ౬౨ మంది శిక్షింపబడియున్నారు.

## సరిహద్దురాష్ట్ర సత్యాగ్రహము

సరిహద్దురాష్ట్రంలో కాంగ్రెసుసత్యాగ్రహం ఫిబ్రవరి౪వ తేది అరెస్టులులేక సాగింపబడెను.

౬వతేది సరిహద్దురాష్ట్రంలో సత్యాగ్రహం చేసినవారిలో పూర్వప్రధాని డా॥ ఖాన్ సాహేబుగారుకూడా యుండిరి.

## అహరారు నియంత అరెస్టు

క్రొత్తఢిల్లీలో శ్రీ గోవిందచరణ్ గారును, మజ్లిసు-ఇ-అహరారు ౫-వనియంత మక్బూల్ హుసేను గారును, మరియిద్దరువాలంటీర్లును సత్యాగ్రహమొనరించినందుకు యీదినంఅరెస్టుచేయబడిరి.

## సత్యాగ్రహుల విడుదల

నెల్లూరు తాలూకా కాంగ్రెసుకమిటీఅధ్యక్షులును, నెల్లూరుభూమి తనఖాబ్యాంకి డైరెక్టరునగు శ్రీ వేణుబాక వీరరాఘవరెడ్డి గారు ఫిబ్రవరి ౪వతేదీపుదయం ౯-౧౫ గంటలకు ముత్తుకూరు గ్రామంలో గ్రామచావిడివద్ద యుద్ధప్రతికూలనినాదములుచేసి సత్యాగ్రహమొనరించిరి. కాని వారిని అరెస్టుచేయలేదు.

పుత్తూరుతాలూకా పరమేశ్వరమంగలం గ్రామం శ్రీ రాపూరుగోవిందస్వామి నాయుడుగారు ౩౦-౧-౪౧తేది ఉదయం౯ఘంటలకు పరమేశ్వరమంగలములో సత్యాగ్రహంచేసిరి. వారు అరెస్టు కాబడి అదినమే చంద్రగిరి జాయింటు మేజస్ట్రీటువద్దకు తీసుకొనిపోబడిరి. జాయింటుమేజస్ట్రీటు అదినమే పుత్తూరుసబ్ జెయిలులో ౬-౨-౪౧ తేదివరకు రిమాండులోవుంచి తీసుకొనిరమ్మనేటట్లు వుత్తరువుయిచ్చిరి. ప్రత్తూరు సబ్ జెయిలులో ౫-౨-౪౧తేదీవరకు రిమాండులో వుండినారు ౬-౨-౪౧వ తేది సత్యాగ్రహిఅయిన శ్రీ రాపూరు గోవిందస్వామినాయుడుగారిని పోలీసువారు, రేణిగుంటకుసమీపం అల్లికాళంగ్రామమువద్ద విడిపించినారు. ఆసత్యాగ్రహి౬వతేది రేణిగుంటకువచ్చి అదినంసాయంత్రం ౫ ఘంటలకు సత్యాగ్రహంచేసిరి. పోలీసుఅధికారులు అరెస్టుచేయలేదు.

## అరెస్టుచేయక వదలుట

ఫిబ్రవరి ౪వతేది కాకినాడతాలూకా వాకాడగ్రామంలో శ్రీ కొండా రత్నాజీరావుగారు సత్యాగ్రహముచేయగా పోలీసువారు అరెస్టుచేయలేదు. ఆయన యుద్ధప్రతికూల ప్రచారముతో యితరగ్రామములకు యాత్ర సాగించుచున్నారు.

## ఎలిమెంటరీ స్కూలుటీచరు రాజీనామా

తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా జిల్లాబోర్డు ఎలిమెంటరీస్కూలు ప్రధానోపాధ్యాయులును. రాయవరం కాపురస్థులును అయిన శ్రీ పాలిపూడి సత్యనారాయణమూర్తి గారు సత్యాగ్రహము చేయుటకు తమఉద్యోగమునకు రాజీనామానిచ్చిరి.వీరు శ్రీ గాంధిమహాత్మునిఆజ్ఞను ఒడసిరి.

## జుర్మానావసూలుచేయుట

తెనాలితాలూకా కూచిపూడిగ్రామంలో సత్యాగ్రహము గావించి యుద్ధప్రతికూలవాక్యములు బల్కినందుకు తెనాలి డిప్యూటీకలెక్టరు ఆర్ డి. పాలుగారిచే శిక్షింపబడిన శ్రీ కల్లూరి చంద్రమౌళి ఎం ఎల్ ఏ. గారికి విధించిన౩౦౦ రూపాయల జుర్మానా తెనాలితాలూకా పోలీసువారిచే వసూలుచేయబడెను.

## జుర్మానా చెల్లించుట

పాతపట్నము తాలూకాతుంగతంపర అగ్రహారముకాపురస్థుడు శ్రీ యుతభమిడిపాటి కృష్ణమూర్తిగారు సదరుగ్రామములోనే జిల్లాబోర్డు మెంబరు ప్రభాయజ్ఞేశ్వరశాస్త్రుగారి ఆఫీసుగదిఎదురుగా ఫిబ్రవరి ౬ వతేదిఉదయము పదిగంటలకు సత్యాగ్రహముచేసిరి. వారినిఅరెస్టుచేసి శ్రీ కాకుళములో డిప్యూటీకలెక్టరువద్దకు తెచ్చిరి. శ్రీ కృష్ణమూర్తిగారికి కోర్టుముగియువరకు శిక్షయు, పదిరూపాయలు జుర్మానానువిధించిరి. గాంధిగారి ఆదేశానుసారముగా జుర్మానాను పంతులుగారుచెల్లించిరి.

౬ వ పేజి చూడుడు

## గార్లజాగీరు

**బందోబస్తు కొన్ని ప్రాంతాలలో వున్నది ప్రస్తుతము సర్వేయర్లు రీసర్వే చేస్తున్నారు**

గార్ల, ఫిబ్రవరి ౮

౧౩౫౦ వ ఫసలీ ఇస్ఫందారు ౨౫ వ తేది సోమవారంనాడు శ్రీయుత కొలమరగలి నారాయణరావుగారు (వరంగలుజిల్లా ఆంధ్రజనసంఘ కార్యకారిణీసభ్యుడుగారి పేరట ఈ గోలకొండ పత్రికయందే ప్రకటించిన "గార్లజాగీరు పరిస్థితులు" అనేవ్యాసమును విలోకించితిని.

శ్రీ శ్రీ జాగీరుదారుగారు హైదరాబాదు వందేయున్నప్పటికి శ్రీవారు, వారికుమారులును సంవత్సరమునకు పది పదిహేను సారులు జాగీరునకువిచ్చేసి, వచ్చినపుడెల్లను నాలుగైదురోజులుండి జాగీరువిషయములను, ప్రజలబాగోగులను, విచారించి తెల్పుచునేయుండిరిగాని కేవలము హైదరాబాదునందే యుండుటలేదు.

**భూమి పన్నులు**

జాగీరులో నాల్గుజారిపన్నులు నారాయణరావుగారు శ్లేషించినఘోరాలు, ఖాల్సాలోకన్న ఎక్కువగ యేమియు లేవు. ఈజాగీరులో తరీభూమి ౪౫౦ ౧కి రు ౬-౦-౦ రూపాయిలచొప్పున విశేషభాగమున్నూ, రు ౭-౦-౦ రూపాయిల చొప్పున కొంతభాగమున్నూ, ఇంకా కొన్ని కొన్నిచోట్ల రైతులు తమపట్టాలో వున్న భూమికన్న యెక్కువగా ఆక్రమించుకొనినభూములకు శిరాషారా లేకపోవుటయు(ఇలావుండుటకుకొన్ని ఆధారములు మరొకసారిప్రకటిస్తాను) రైతులు ఆక్రమభూములను ప్రభుత్వమువారు చూడలేదని భుక్తముచేసుకొనుచు వాటికియేవిధమైనధారాలు చెల్లించక తటస్థముగా నూరకుండుటయు జాగీరు ప్రజాలోకమునకు విదితము. ఇట్లు వుండుటకు కారణము నాగరమక్తాలనీ, యిస్త్రావు కౌళ్ళనీ ఉండుటయు, పాలకులయొక్క యుదారస్వభావమును, విశేషించి శ్రీజాగీరుదారువారికి ప్రజలపైగల కరుణాతిరేకముచేతను తటస్థముగానుండుటయు, మొదలుగాగల కారణములాధారములను కొనవలయునేగాని అన్యథాభావించుట కెట్టియవకాశములును గాన్పింపవు

**లోకల్ ఫండు**

ఈజాగీరులో లోకల్ ఫండువసూలుచేయుచున్నప్పటికిని అట్టిది ప్రజోపయోగార్థము రోడ్లు, డొంకలు, తూములు, వగైరాలకును, ప్రభుత్వోద్యోగుల (నైజామ్‌గవర్నమెంటు) సౌకర్యార్థమున్నూ యింకా గ్రామపారిశుధ్య విషయములలోనూ, వినియోగింపబడుచున్నదేగాని జాగీరుప్రభుత్వమువారు యిందుదోచుకొని తినుచున్నదేమియు గాన్పింపదు.

**వైద్యము**

ఈజాగీరు ప్రధానగ్రామమైన గార్లలో సమర్థత కలిగిన జాగీరు ప్రభుత్వపు వైద్యాలయముగలదు. ఇందుఒకడాక్టరు, ఒక కాంపౌండరు, ఇరువురు చప్రాశీలుగలరు. ఇందు ప్రతి దినమును జాగీరు గ్రామములలో నుండి వచ్చినప్రజలు ఆపదలోపడివుండి యుచితవైద్య సహాయమును పొందుచుందురు. కాని కేవలము జాగీరుఉద్యోగస్థుల వినియోగార్థము మాత్రమే యుపయోగపడుచున్నదని నారాయణరావుగారు వ్రాసిరి.

**విద్య**

ఇచ్చటజాగీరు వారిపాఠశాలయుగలదు. ఇందు అయిదుగురుపాధ్యాయులును, ఒకఉపాధ్యాయినియు, ఇరువురుచప్రాసీలును, ఒకజవానుగలరు. ఇందుసక్రమముగా విద్యగరపబడుచున్నది. పరీక్షకులచేతను, శ్రీజాగీరుదారువారి తనఖీలోను మొదలుగాగల సద్విధానమూపేణా యున్నదిగాని అనూయాపరులువ్రాసేటంత విమర్శనలకు గురిగాలేదని విజ్ఞులుగ్రహింపగలరు, యింకను అనేకచోటుల రోడ్లు గ్రామసౌకర్యార్థము జాగీరువారుచేసియున్నారు,

**వ్యవసాయపు నీటిపారుదల సౌకర్యాలు**

మాల్గుజారీ నీటిపారుదలఖర్చులు రైతులనుండి వేరుగావసూలు చేయబడుచున్నదని నిజముతెలుసుకొనక చెప్పుడుమాటలనేనమ్మి పత్రికలలో ప్రకటించుట కేవలముపొరపాటని మనవిజేయుచున్నాను. కాలువలు మరమ్మతుజేసేవిషయములోను. చెరువులు వగయిరాలకుముప్పువచ్చినప్పుడు బాగుచేయించేవిషయములోను. జాగీరుప్రభుత్వమువారే సంపూర్ణసహాయసంపత్తులు రైతులకు కలిగించుచుండిరిగాని కార్యకారిణీసభ్యులు వ్రాసినటుల లేదు.

**పుల్లరీ యథార్థము**

జాగీరులో పట్టాదారులనుండి పుల్లరీ వసూలు చేయబడుటలేదుగాని మూఢులగు అనామకపు గుత్తేదారులు అమాయకులైన ప్రజలవద్ద అట్టిది వసూలుచేయుచుండిరేమో తెలుసుకొని నిజమును మరొక వ్యాసములో ప్రకటించెదను.

**వెట్టి**

ప్రజలలోనుండి జాగీరుప్రభుత్వమువారు వెట్టిచాకిరీ తీసుకుంటున్నారని వ్రాయుట చాలా సాహసము. ఈజాగీరులో యిట్టివి, యిప్పుడు జరుగుటలేదని జాగీరుప్రజలనే విచారించిన తెలుసుకొనగలరు

**టపా**

గార్లలో టపాఏర్పాటు మిక్కిలి సౌకర్యార్థముగనున్నది, జాగీరులో అన్నిగ్రామాలకును ఈటపాద్వారా వార్తాపత్రికలు, వుత్తరములు అందేయేర్పాటులు విశేషముగా చేయబడియున్నవి. సౌకర్యములు లేవని వచ్చినజాబులు మాకందుటలేదని ఒక్కరైతుచేత ఈయిరువది రెండుగ్రామాదులలో నిరూపించినయెడల పత్రికలోప్రకటించినవ్రాతలు నిశ్చయములని నమ్మవచ్చును. ప్రస్తుతము జరుగుచున్న బందోబస్తువిషయములో రైతులనుండి పూర్తిఖర్చులు బీగము ౧కి రు౧-౦-౦ ఒకరూపాయి చొప్పున పన్ను వసూలుచేయుచున్నారని వ్రాయుట కేవలము సర్వాబద్ధము.

**రిపేరీలు**

వరుసగా నొక్కొక్కటి చెరువుగాని, కుంట గాని కాల్వగాని, ఆనకట్టగాని తూముగాని రోడ్డుగాని బాగుచేయించెదరుగాని అన్నియు ఒక్కసారిగా బాగుజేయించుట కేప్రభుత్వమునకు మాత్రమలవియగును? క్రిందటిసంవత్సరము బయ్యారపుచెరువును, గార్లచెరువును మరమ్మతుజేయించియుండిరి. ఈసంవత్సరము తదితరములు పరిష్కరించుకొనుచున్నారు.

**రకంవసూళ్ళు**

మాల్గుజారీరకం పూర్తిగా అన్నిగ్రామాదులనుండి వసూలు చేయబడినది. కొన్నికొన్నిచోట్ల అనగా తెగుళ్ళుగలిగి కొలదిగా పంటచెడిపోయినచోట్ల అర్ధధారా వసూలుచేయబడినట్లు వినికిడి అంతేగాని లేనిపోని రూపాయికొరకు అపుడేకారని ఆరోపణజేయుట మరియొక అనృతము,

ఇట్లు
డి. భాస్కరరాజు

---

## వీరశైవులకు విజ్ఞాపన

ఈసంవత్సరము ౧౩౫౦ఫసలీలో జనపరిగణనలో వీరశైవులు ధర్మమునుతెల్పు ఖానాలో వీరశైవులనియు, జాతిఖానాలో లింగాయతులనియు వ్రాయించుటసమంజసము. ఇట్లువ్రాయించవలెనని ౧౮వఅఖిలభారత వీరశైవమహాసభవారు నిర్ణయించియున్నారు. జాంగ్లీ, మటుకరి, గాండ్ల, బిప్ప, అవుసల ఇటువంటి యేపేర్లనుకాని వ్రాయించకుడు తమ మాతృభాష కన్నడభాషయని వ్రాయించగోరుచున్నాము,

ఇట్లు
శెట్టి. రేవప్ప కార్యదర్శి
వీరశైవసమాజము, సదాశివపేట

## సత్యాగ్రహవార్తలు

౫ వ పేజీ తరువాయి

### తూర్పుగోదావరిజిల్లాలెక్క

ఆంధ్రదేశములో జనవరి నెలలో శిక్షితులయిన రేఖ ఉగురు కాంగ్రెసు సత్యాగ్రహులకును తూర్పుగోదావరిజిల్లాలో ౩౬గురు సత్యాగ్రహులకు శిక్షలువిధింపబడెను. జనవరి౬ మొదలు ఫిబ్రవరి౫ తేదీవరకు సత్యాగ్రహంచేసినవారి మొత్తం, కాంగ్రెసు లెక్కల ప్రకారము ౯౦మంది ఇందులో ౭౨ శిక్షింపబడిరి. ౨వారములు మొదలు ౭ క సంవత్సరమువరకు కఠినశిక్షలు విధింపబడెను. [ఒక్క—ఒకరికిప్పు—వారికి విడిక్షారు) శిక్షింపబడినవారిలో ౧౦మందికి “బి” క్లాసుయివ్వబడెను. తక్కినవారికి ‘సి’ క్లాసు వీరందరకువిధింపబడిన జుర్మానాల మొత్తం రూ ౧౩,౩౨౦ మిగతా కేసులలో కొందరిచరాస్తులు జప్తుకుపెట్టబడినవి. కొంతసొమ్మువచ్చియుండవచ్చును.

ఈ రెండవసత్యాగ్రహ జాబితాకుపూర్వం మొదటిజాబితాప్రకారం ౨౯-౧౧-౪౦ నుండి ౧౬-౧-౪౧వరకు శాసనసభ్యులు, ౧. అ. కా. కా. స. సభ్యుడు శిక్షింపబడిరి. వారిజుర్మానామొత్తం రూ౫, ౫౦౦వీరిలోకొందరి ఆస్తులకూడ జప్తుచేయబడినవి. కొంతసొమ్ము వసూలు చేయబడెను,

### ౨ ౨ జతల ఎడ్ల బండి పై ఊరేగింపు

ఆంధ్రదేశంలో పెనుకొండ తాలూకా సిద్ధరాంపురమున ఫిబ్రవరి ౬వతేదిన సా॥ 3 గం. కు శ్రీ ఎద్దుల వరసారెడ్డిఅను కాంగ్రెసు సభ్యుడు ౨౨ జతలఎడ్లచే యీడ్వబడినబండిపై యూరేగింపు జరిగినపిదప ౪ గం॥కు యుద్ధ వ్యతిరేకపుకేకలవేసి సత్యాగ్రహము చేసిరి.

పెనుగొండజాయింటుమేజిస్ట్రేటు వరసారెడ్డిగారిని సబ్ జైలునందు 3 దినములు రిమాండునందుంచవలయుననియు, ౧ వ తేది పగలు ౧౧గం॥కు తనయెదుట హాజరుచేయవలెననియు ఉత్తరువుచేసిరి.

### అరెస్టువెంటనే విడుదల

చిత్తూరు పురవీథులలో ఫిబ్రవరి ౫ తేదినయుద్ధప్రతికూలప్రచారముచేసిన శ్రీకేశవులునాయుడను యువకుకుఅరెస్టుచేయుబడి మరునాటిమధ్యాహ్నమువరకు రిమాండులోనుంచబడి మేజిస్ట్రేటుగారియెదుట హాజరుపెట్టబడెను. మేజిస్ట్రేటు అతనిని విడిచిపెట్టిరి.

### ఢిల్లీప్రయాణము

బళ్లారిజిల్లా నేమకల్లుగ్రామములో సత్యాగ్రహముచేయగా అరెస్టుచేయవలసిన సత్యాగ్రహులు శ్రీహరికథరామశర్మ, యల్. సీతారామరెడ్డిగార్లు, శ్రీమహాత్మా గాంధిగారి ఆజ్ఞప్రకారము కాలినడకపై ఢిల్లీప్రయాణమైపోవుచు మధ్యత్మ్యనచర్లలో ఫిబ్రవరి ౭ వతేది యుద్ధప్రతికూలకేకలువేయుచు సత్యాగ్రహమొనర్చిరి. పోలీసు అధికారివచ్చి సత్యాగ్రహులపేర్లు, గ్రామముననైరావాసుకొని వెళ్లిరి. అరెస్టుచేయలేదు.

### అరెస్టులేదు

తెనాలితాలూకా జంపనిగ్రామంలో ౭-౨-౪౧ వతేదిన శ్రీ మొవ్వావాకయ్య మొవ్వా సూర్యనారాయణగార్లును, మోపర్రుగ్రామంలో శ్రీ లికేటిజనార్దనంగారును కొడాలి లక్ష్మీనారాయణ శ్రీ కొడాలిసూరయ్యగార్లును తెనాలిపట్టణంలో శ్రీఅయినంపూడిఅచ్చయ్య శ్రీ కారంపూడి వెంకటేశ్వర్లు శ్రీ తాతూరు రామలింగుగార్లును యుద్ధప్రతికూలకేకలువేయుచుసత్యాగ్రహముగావించిరి. పోలీసువారుపైవారినిఅరెస్టుగావింపలేదు పైసత్యాగ్రహులందరును యుద్ధవ్యతిరేక నినాదములుజేయుచు తెనాలిపురవీథులందు ప్రతిబజారులిరిగి యన్నపల్లిగ్రామమునకువెళ్లిరి.

### న్యూసెన్సుఆక్టుప్రయోగము

ది ౫-౨-౪౧ వతేదిఉదయం ౭ గంటలకు వానపల్లిలో శ్రీక్రొసోమసుందరంగారు యుద్ధవ్యతిరేకకేకలువేసి సత్యాగ్రహముచేసిరి. వారినిఅరెస్టుచేసి శ్రీకొత్తపేట డిప్యూటీ తహశీలుదారువారియెదుట హాజరుపెట్టిరి. వారున్యూసెన్సుఆక్టుక్రింద కేసువిచారణచేసి రు ౫౦జుర్మానావేసిరి. ఇవ్వకయెడల 3 వారములుజైలు. వారుజుర్మానాయివ్వక నిరాకరించినందున జైలులో వుంచిరి కొనిఅకారణముగా రాత్రి ౯ గం.సరఅ విడుదలచేసిపంపివేసిరి.

ఫిబ్రవరి ౬ వతేదిగురువారంఉదయం ౧౧ గంటలకు బెజవాడలో శ్రీజె-రామలింగయ్యశ్రేష్ఠిగారు, పెద్దబజారుమధ్య బయలుప్రదేశములో యుద్ధ ప్రతికూలవాక్యములు పలికినందునపోలీసుసబ్ ఇన్స్పెక్టరు గారువచ్చి చూచివెళ్లిపోయినారు: అరెస్టుచేయలేదు. సుమారు ౧౦౦౦ మందివచ్చియుండిరి

### బళ్లారిజిల్లాలో సత్యాగ్రహముఆపుదల

బళ్లారిజిల్లాలో ఆదవాని, ఆలూరుతాలూకాలలో ప్లేగువ్యాధి తీవ్రముగావ్యాపించియున్నందున బళ్లారిజిల్లా ఆదవానిడివిజనులో తాత్కాలికముగ సత్యాగ్రహోద్యమము ఆపుదలగావింపబడినది.



## హైదరాబాదు బజారు ధరలు

తేదీ ౧౧-౫-౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము ధరలన్నీ హాలీకే.

| బియ్యము | పల్లా ౧కి ధర | | | |
|---|---|---|---|---|
| | రూ | అ | పై | |
| కిచిడిసాంబర్లు | ౨౫ | ౦ | ౦ | |
| జంబర్లు | ౨౩ | ౯ | ౦ | |
| ఢిల్లీభోగాలు | ౨౩ | ౦ | ౦ | |
| రాంభోగర్లు | ౨౧ | ౧౨ | ౦ | |
| నాన్క్రాం | ౧౩ | ౦ | ౦ | కొత్తవి |
| | ౨౧ | ౯ | ౦ | పాతవి |
| ఆర్కాటి | ౧౬ | ౧౬ | ౯ ౦ | కొత్తవి |
| | ౨౧, | ౨౦ | ౯ ౦ | పాతవి |
| కోనామణి | ౧౫ | ను డి ౧౯ | | కొత్తవి |
| బుడుములు | ౧౪ | ౯ | ౦ | |
| జేశావరి | ౧౫ | ౯ | ౦ | |
| గోధుమలు షర్బతి | ౧౯ | ౯ | ౦ | |
| బన్సీ | ౧౭ | ౯ | ౦ | |
| ఉమ్మ రీ | ౧౬ | ౯ | ౦ | |
| పాటియా | ౧౬ | ౦ | ౦ | |
| ఎర్రగోధుములు | ౧౩ | ౧౨ | ౦ | |
| జొన్నలు | ౧౦ | ౦ | ౦ | |
| తెల్లజొన్నలు | ౧౦ | ౪ | ౦ | |
| పచ్చజొన్నలు | ౭ | ౯ | ౦ | |
| మడికట్టుజొన్నలు | ౭ | ౧౨ | ౦ | |
| పెసలు | ౧౨ | ౪ | ౦ | |
| కందులు | ౯ | ౯ | ౦ | |
| మినుములు | ౯ ౧ ౨ ౦ నుంచి ౧౦ ౦ ౦ | | | |
| అలసందలు | ౧౧ | ౦ | ౦ | |
| సజ్జలు | ౭ | ౯ | ౦ | |
| కుసుమలు | ౭ | ౯ | ౦ | |
| పప్పు | | | | |
| శెనగపప్పు | ౧౫ | ౯ | ౦ | |
| కంది ,, | ౧ | ౪౦ | ౦ | |
| సిరిపెసర ,, | ౧౯ | ౦ | ౦ | |
| అలసంద ,, | ౧౧ | ౪ | ౦ | |
| మినుప ,, | ౧౯ | ౦ | ౦ | |
| పెసర ,, | ౧౯ | ౯ | ౦ | |
| బెల్లము | ౧౦ ౦ నుంచి ౧౧ | ౯ | ౦ | |
| ఉప్పు | ౧౨ | ౧౩ | ౦ | |
| వుల్లిగడ్డ | ౯ | ౯ | ౦ | వరకు |
| తెల్లనరుకు | ౧౨ నుంచి | ౨ | | వరకు |
| చక్కెరమణుము (౪౦ సే) | | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ | |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ | |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజామాబాదు ,, ,, | ౧౩ | ౧౨ | ౦ | |
| తెల్లచక్కెర ,, పల్ల | ౧౩, | ౧౨ | ౯ ౦ | |
| కర్పూరచక్కెర ,,(౪౦ సే) | ౧౬ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ ,,౧౨సే | ౨ | ౧౨ | ౦ | |
| అల్లం ,, ,, | ౧ | ౧౨ | ౦ | |
| మణుము ౧౨ సే | | | | |
| కొబ్బెరనూనె | ౪ | ౯ | ౦ | |
| కుసుమనూనె ,, | ౩ | ౫ | ౦ | |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ | |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౯ | ౦ | |
| వుంటెనూనె ,, | | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧కి | | | | |
| నెయ్యి దిమణుము ౪౦ సే | | | | |
| విదరునెయ్యి ,, ,, | ౪౨ | ౦ | ౦ | |
| తెలంగానా ,, ,, | ౩౯ | ౦ | ౦ | |
| వనస్పతి డబ్బా ౧కి౧౧ | ౨ | ౦ | | |
| బంగారు తు ౧కి | ౫౦ | ౯ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౭౦ | ౯ | ౦ | |
| తు ౧కి | ౦ | ౧౧ | ౦ | |
| సవరిన్ ౧కి కల్దారు రూ | ౨౯ | ౯ | ౦ | |
| మారకం | | | | |
| హాలీకి కల్దారు | ౧౫ | ౧౯ | ౬ | |
| కల్దారుకు హాలీలు | ౧౫ | ౧౧ | ౬ | |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ | |
| వేరుసెనగ | ౯ | ౪ | ౦ | |
| బుడ్లలు పల్లా౧కి | ౯ | ౪ | ౦ | |
| పప్పు పల్లా౧కి | ౧౨ | ౦ | ౦ | |

గమనిక: —

పైధరలు ఏ దైవంక వరకు సరియైనవి గా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు.ఈ. నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలో గొప్పవర్తకులు తమతమకొనముల ప్రకటనలు మాపత్రికలో వేసికొనినవారి వ్యాపారానికి ప్రచారము కలుగును.



## మ. ఘు. వ. నిజాంస్టేట్ రైల్వే.

### మహాశివరాత్రికి తగ్గింపు రిటర్న్ టిక్కెట్లు.

౧౯ నుండి ౨౪ ఫిబ్రవరి ౧౯౪౧ వరకు యీ రైల్వేలో ఏస్టేషను నుండియైనను యీక్రిందిస్టేషన్లకు రెండు ప్రయాణములకు కలిసి ౧¼ ప్రయాణపుచార్జీతో 3వ తరగతి రిటర్న్ టిక్కెట్లు యివ్వబడును.

కర్నూల్ టౌన్. (శ్రీశైలముకు)

కామారెడ్డి (వేములవాడకు)

భోంది (జాంధా)

దౌలతాబాదు వెరూల్‌లోయున్న జ్యోతిర్లింగము

పర్లి వైద్యనాథ్

యీటిక్కెట్లు తిరుగుప్రయాణమును 3మార్చి ౧౯౪౧ తేదిరాత్రిలోగా పూర్తిచేసుకొనుటకుపయోగించును.

బై ఆర్డర్

## బ్రిటిష్ యుద్ధ వ్యయానికి ౧౬౦౦ కోట్ల పౌనులు

కామన్సుసభ వారి ఆమోదము

బ్రిటిష్ కోశాంగ మంత్రి సర్ కింగ్ స్లీవుడ్, ఏప్రిల్ నెలలో వచ్చే బడ్జెటు సమయంవరకు దేశంలో యుద్ధవ్యయాన్ని ఎదుర్కొనడానికి గాను ౧౬౦౦ కోట్ల పౌనుల అప్పుకోరుతూ బడ్జెటు ప్రతిపాదన చేసిరి. మొత్తంమీద అన్నిరకాల యుద్ధవ్యయాలకూ బ్రిటన్ నగటున రోజుకు ౧౨,౫౦౦౦౦ పౌనులు ఖర్చుపెట్టుతున్నది. గతయుద్ధంలో ఖర్చుపెట్టిన అత్యధిక సంఖ్యను ఇదిఅప్పుడే దాటిపోయినది ఇంకా ఈ సంఖ్య హెచ్చుతున్నది. వాగ్యాములను ఎక్కువగా హెచ్చుటను ప్రభుత్వం గుర్తిస్తూ, కరెన్సీప్రమాణాన్ని కాపాడగల ఏర్పాట్లను చేయదలచుకున్నట్లు కింగ్ స్లీగారు తెలియజేసిరి.

ఈదినం ౨౦౦ కోట్ల పౌనులఋణానికి కామన్సుసభఆమోదించినది. ఈమొత్తం మార్చి ౩౧ తో అంతంకాగల ఆర్థికసంవత్సరానికి సరిపోతుంది ఏప్రిల్ ౧ తో ప్రారంభంకాగల కొత్త సంవత్సరానికి మరి ౧౦౦౦ కోట్ల పౌన్లు ఆమోదింపబడినవి. మొదటిమొత్తంవల్ల ఏడాదిఅంతటికీ యుద్ధదశాలఅవసరాలనిమిత్తం ఈయేటికి ౩౩౦ కోట్ల పౌన్లఖర్చుఅవుతున్నది తదితరజాతీయకార్యక్రమాలకు వినియోగించే మొత్తం ఇందులో చేరదు. ఒకరోజుదాదిలో సైనికఖర్చు రెండింతలయిందని కోశాంగమంత్రి అన్నాడు. ఈబ్రహ్మాండమైన వ్యయాన్నిబట్టి ప్రజలకుభారించాలాహెచ్చుతున్నదనీ, వెంటనేతీరవలసినఅవసరాలకోకాక ముమ్ముందుప్రజలకు మంచిజీవనపరిస్థితులు ఏర్పరచడానికి ప్రణాళికలనుకూడా ఆలోచిస్తే ఇంకాఎక్కువ భారాలకు సిద్ధపడవలెనని ఇతడనెను.

## హిందూస్థానానికి స్వాతంత్ర్యమున్నా

మద్రాసు గవర్నరుగారు పాలఘాటులో ఉపన్యాసమిచ్చుచూ ఇట్లన్నాడు. ఇంగ్లిస్థాను ఓడిపోతే హిందూస్థానానికి స్వాతంత్ర్యంలేదు. తరతరాలుగావారు బానిసలుగాఉండి నాజీలపాటకు పీరుతాళముచేస్తూఉండగలరు. జర్మనీని ఓడించేదానికి చాలాకాలముపట్టవచ్చును. కాని నిష్కర్షగా జర్మనీనిపండబెట్టి యికముందు ప్రపంచంలోయుద్ధాలులేకుండా చేయుటకై ఇంగ్లీషువారు గట్టిగాసంకల్పంచేసినారు.

యిస్తేహారుఅజునప్తర్ మహాక్కమే తహశీల్ సమస్థాన్ రాజపేటజిలే నల్లగొండ దఫ్తుమర్కూంచగ౬ ఫర్వర్ది ౧౩౫౦ ఫసలీ

### యిస్తేహారు

ఇందువలన సమస్తజనులకు తెలుపుటయేమనగా ముసమ్మియర్రం వీరనాగయ్య సాహుకారు సా॥ పాలుమొకాం ఆలేరుతాలూకా భువనగిరి పటువారి మ॥ కుర్రవరం యిలాకే సమస్థాన్ రాజపేట తనకు మొగసంతానములేదని భవిష్యతి తన స్థిరచరాస్తి వగతులనుగురించి వతముఖర్యారిషే అయిందానిమిత్తం తమతమ్ముడైన యర్రం రామయ్య కొ॥ వీరభద్రయ్యను పెంపకమునకు తీసుకొని వుండివున్నట్లుగ సదరు వీరనాగయ్యదరఖాస్తునుంచి తెలుపబడుచున్నది ఆయిందా కుర్రవరంపటువారిగిరివ పటేలుజాతు భాధ్యతగురించి తబునియ్యతు మంజూరికొరకు సమస్థాన్ హజూలో రుజువుఅయ్యువుండివున్నారు. కావున యెవ్వరికైనను ఇట్టిపెంపకను విషయము[illegible] వుకరుదారివుంమనపనకు (౩) మూడునెలల ముద్దతులోతహస్సిల్ హజూలో రుజువుఅయ్యవుజరుదారి పేషు చెయ్యవలెను. బాజుముద్దతువుజరుదారి యెన్నిఫనైన సమతుకానేరదు. ఫక్తు ఇట్లు

తహశీల్ దాక్.

## దున్నపోతు స్వర్గానికే! మనము స్వర్గానికే!!

సింహళద్వీపములో కేగల్లీఅ నేడూరిలో యిద్దరుమనుష్యులు ఒకదున్నపోతునుగాను కొట్లాడుకొన్నారు. అదున్నపోతునాదంటేనాది అని కొట్లాడుకున్నారు. కోర్టులో ధర్మశాస్త్రాలు నెత్తిపెట్టుకొని ఉభయులున్నూ ప్రమాణంచేసినారు. ఈచివక్కను వివదీసేదానికి ఒకవకీలిట్లన్నాడు— "అయ్యా, ఈదున్నపోతును అమ్మండి, వచ్చిన పైకమునుదేవళానికియ్యండి" సరే అనివారిద్దరున్నూ ఒప్పుకొన్నారు. న్యాయాధికారి పెద్దగా ఊపిరివిడిచి యిట్లన్నాడు. "అమ్మయ్యా! చిక్కుసులభంగా నేవదిలింది. ఓయీ వాది ప్రతివాదులారా మీరుపరస్పరం తీర్పుచేసుకొన్నందుకు సంతోషించింది, లేకపోతే మీలో ఒకరుస్వర్గానికి ఒకరు నరకానికి పోతూఉండేటిరి. ఇప్పుడు మీ ద్రవ్యం దేవళానికి ఉపయోగపడుతుంది కాబట్టి నిజమైనదున్నపోతుయజమాని స్వర్గానికిపోతాడు అబద్ధముయజమానికి పారమార్థికబుద్ధి పుట్టినది కాబట్టి వాడున్నూ స్వర్గానికేపోతాడు. దున్నపోతుద్వారా మోక్షం అయినందున ఆదిన్నీ స్వర్గానికే పోతుంది. పకీళ్లనుంచి ఆగోచరచెప్పినందుకు "కర్తా కారయితా చైవ" అన్నట్లుగా వీళ్లున్నూ స్వర్గానికే యేగుతారు. ఇట్టి సత్కథాశ్రవణ ఫలంగా మనమూతా స్వర్గానికే వెళ్తాము." అని ఒక ఉపన్యాసంకొట్టి ముగించినాడు.

## యుద్ధముపై జోస్యము

భారత దేశ విముక్తి యెప్పుడు

పండితు పీ హెచ్. సర్ ౧ నేజోతిష్కుడు కాశ్మీరదేశమునావారిప్పుడు లాహోరులో ఉన్నారు వారిదివరలో భీకరభూకంపముజరుగునని, పిట్లరుపైకివచ్చునని, ఆఫ్ఘనిస్థాను పాదుషా వచ్చిపోవునని, ఫిన్లెండు ప్రాణ్సుపడిపోవునని, అముక (ఫలానా) దినమునాడు యుద్ధంప్రారంభమగునని సరియైనతేదీలతో జోస్యంచెప్పయుండెను. అందుచేతవారిప్పుడు మళ్లీచెప్పిన యీ క్రింది జోస్యమునకు విలువయెంతయుండునో గమనించవలసియుండును ముందుజరుగబోయ్యే సంగతులనుగురించి వారిట్లుజోస్యముచెప్పినారు.

భారతదేశములో చాలామార్పులు జరుగును. భారతదేశములో ఇప్పుడు పరిపాలనచేసేవారికి బలముతక్కువైపోవును. కాంగ్రెసుకుబలంకలుగును. అధికారం ప్రజాయత్తమగును. పాకిస్థాను[illegible] ఏమిన్ని ఉండవు. మేనెల ౧౯౪౧ నుండి ఒకసంవత్సరంలోగా జిన్నాదశమాసిపోతుంది. భారతదేశానికి ఆస్ట్రేలియావంటి అధినివేశప్రభుత్వంలభించును. ఇప్పుడు భారతదేశములో ఏర్పడిన విషమరాజకీయపరిస్థితి ౧౯౪౧ జూలై నెలలోపుగా మారిపోవును. మార్చినెల సగముగడిచేవరకే ఒకసమాధానంకుదిరిపోతుంది. ఇండియాను విదేశీ అక్రమణజరుగదు యుద్ధానంతరం విదేశాలనుండిద్రవ్యం ఇండియాలోకి విరివిగా ప్రవహించును

### స్త్రీల అరెస్టులో ఆలస్యము

ఫిబ్రవరి ౧వ తేది ఉదయం గుంటూరులో లాయరుపేటవద్ద బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారు సత్యాగ్రహమొనర్చిరి. పోలీసువారు అరెస్టుచేయనందున ఆమె బయలుదేరి బజారులవెంబడి గుంపుతో యుద్ధవ్యతిరేకపు కేకలువేయుచు వెళ్ళెను. వడిబజారులో దాదాపు అదేసమయమందు మట్టుపల్లి నాగలక్ష్మమ్మగారు కన్యకాపరమేశ్వరీ దేవాలయంవద్ద సత్యాగ్రహ మొనర్చిరి ఆమెను పోలీసువారు అరెస్టుచేయనందున ఇద్దరు సత్యాగ్రహులు కలిసి బజారులవెంబడి యుద్ధప్రతికూలపు కేకలువేయుచు నడిచిరి, అంతలో పోలీసువారు వచ్చి వారిద్దరిని అరెస్టుచేసిరి.

### కోర్టులేచేవరకు శిక్ష

నందిగామ తాలూకా కొణకంచి గ్రామకాపురస్థులు రామయ్యగారు సత్యాగ్రహంచేసినందున 30–౧–౪౧ వ తేదిన బెజవాడ సబ్ కలెక్టరుగారు కోర్టులేచువరకు శిక్షవిధించిరి.

### సత్యాగ్రహుల ఢిల్లీప్రయాణము

ఫిబ్రవరి ౧వ తేదిఉదయం శ్రీ మోచెర్ల హనుమంతరావుగారు కుచ్చూరుపోలూరులోను, శ్రీ ఆరకభూమి రామచెంద్రారెడ్డిగారు సుబ్బరాయపేటలోను యుద్ధప్రతికూలనినాదాలు సలుపుచు సత్యాగ్రహముచేసిరి. పోలీసువారు వీరిని అరెస్టుచేయలేదు. వీరిద్దరున్ను, కోటపోలూరులో 3౦–౧–౪౧ తేది సత్యాగ్రహముచేసి అరెస్టుకానట్టి శ్రీ పవని వెంకట కృష్ణయ్యగారున్ను కలిసి గ్రామాలలో ప్రచారమొనర్చుచు కాలినడకను ఢిల్లీకైపోవుచున్నారు.

### అరెస్టువెంటనే విడుదల

చిత్తూరులో బుక్కు-బైండరు గాపనిచేసి జీవించుచుండు శ్రీ టి. దొరస్వామియను నొకయువకుడు ఫిబ్రవరి ౧వ తేది ఉదయము ౧౧ గంటలకు చిత్తూరుకుచేరిన సంతపేటలో యుద్ధప్రతికూలకేకలువేసి సత్యాగ్రహముచేసినందున నతనిని అరెస్టుచేసి టవున్ పోలీసు స్టేషనుకు తీసుకొనిపోయి మధ్యాహ్నము ౨ గంటలవరకు రిమాండులో నుంచగా, పిమ్మట సబుఇనస్పెక్టరు సత్యాగ్రహిని ఇంటికిపొమ్మనెను.

### న్యూసెన్సునేరంక్రింద సత్యాగ్రహుల అరెస్టు

పత్తికొండలో: మాచ్. వెంకటేశ్వరరావుగారిని డి. వీరప్పగారిని న్యూసెన్సుఆక్టుక్రింద ౧–౨–౪౧ యుద్ధప్రతికూలకేకలువేసినందున అరెస్టుచేసి విచిరి. మరల సాయంత్రము 3 గంటలసమయమున పత్తికొండ తాలూకాఆఫీసుయెదుట ఉపన్యసించుచుండగా పోలీసువారరెస్టుచేసి సబ్ మేజస్ట్రేటుగారియెదుట హాజరుపరచిరి, న్యూసెన్సుక్రింద విచారించి పైసత్యాగ్రహుల నిద్దరిని మేజస్ట్రేటుగారు ఒకవారం కఠినశిక్షవిధించిరి.

### సత్యాగ్రహి ఢిల్లీప్రయాణము

జనవరి 3౧వ తేది శుక్రవారం పురవకొండ గ్రామంలో పంచాయతీబోర్డు మెంబరు శ్రీ హరి జనబాకన్న, యుద్ధప్రతికూల వాక్యములుచ్ఛరించిరిగాని, పోలీసువారు అరెస్టుచేయకవిడిచినారు ఈయన గాంధీగారి ఆజ్ఞప్రకారం పల్లెలలో ప్రచారంచేస్తూ ఢిల్లీ ప్రయాణము చేయుచున్నాడు. లత్తవరంగ్రామంలో యీయన ౧వ తేది యుద్ధప్రతికూలవాక్యములు చెప్పినారు. అక్కడకూడ వీరిని అరెస్టుచేయలేదు.

### అరెస్టు చేయలేదు

శ్రీ బూచిగారి వెంకటరెడ్డిగారు ఫిబ్రవరి 3వ తేది ఉదయం ౯ గంటలకు శేషారెడ్డిపల్లి (దానవులపాడు మజరా) యందు సత్యాగ్రహ మొనర్చిరి. కాని వారిని అరెస్టుచేయలేదు. అందుచే సత్యాగ్రహి కాలినడకతో ఢిల్లీముఖముగా దినమునకొక గ్రామమువంతున సంచారముచేయుచు సత్యాగ్రహమొనర్చుటకు నిశ్చయించి పెద్దపసపులకు బయలుదేరిరి.

### శిక్షలేక సత్యాగ్రహిని విడుదలచెయుట

గుత్తితాలూకా కాంగ్రెసు కార్యవర్గసభ్యుడు జి.బి. వెంకటరెడ్డిగారు స్వగ్రామమగుచిట్టూరిలో 3–౨–౪౧వతేదిన సాయంత్రము సత్యాగ్రహముచేసిరి. వీరిని అరెస్టుచేసి, మరునాడు తాడిపత్రిలో క్యాంపుచేయుచుండిన గుత్తిడిప్యూటీ కలెక్టరుయెదుట హాజరుపెట్టగా, డిప్యూటీ మేజస్ట్రేటు వారినివదలిపెట్టినట్లుగా తెలిపిరి.

### సత్యాగ్రహిని రిమాండులోనుంచుట

ఫిబ్రవరి ౪వ తేది ౧౧ గంటలకు చిత్తూరులో ఎలెక్ట్రిక్ ఫిట్టరుగానుండు శ్రీ డి. కేశవులు నాయుడనువారు బజారువెంబడి యుద్ధప్రతికూలముగా ప్రచారముచేయుచు పోవుచుండగా నతనిని టవున్ స్టేషన్ హెడ్ కానిస్టేబుల్ అరెస్టుచేసి పోలీసుస్టేషన్‌లో కొంతకాలముంచి డివిజనల్ మేజస్ట్రేటుగారియెదుట చార్జిషీటు దాఖల్ చేయక నే హాజరుపరచిరి. దానిమీద మేజస్ట్రేటుగారు రెండుదినములు రిమాండులోనుంచి ౫వ తేది హాజరుచేయుమని యుత్తరువు నిచ్చిరి.

### అరెస్టులేదు

ఫిబ్రవరి ౪వ తేది ఉదయం ౧౧ గంటలకు చెన్నూరులో శ్రీ చిట్టంశెట్టి శేషయ్యగారు సత్యాగ్రహమొనర్చిరి. ఇంటిదగ్గరనుండి బయలుదేరునప్పటికే వేయిమంది ప్రజలుగూడిరి. హారములు లెక్కకుమించిపోయెను. పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టరుగారు సిబ్బందితోవచ్చియుండిరిగాని అరెస్టుచేయలేదు.

—

సంవత్సరము చందా
౬ హాలి రూపాయలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥ చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

*Volume* **15** **Hyderabad-Dn.** **Thursday 13 February 1941** *Number* **78**


## బ్రిటిష్‌నౌకాదళస్థితి

నౌకానిర్మాణశాఖామంత్రి అభిప్రాయము

"మనశత్రువుకంటున్న కలలకు ఇప్పటివరకూ ఏదిఅడ్డంగా నిలచివున్నదో అట్టిబ్రిటిషుసామ్రాజ్యంపైన దెబ్బతీయడానికి హిట్లరుఏదో బ్రహ్మాండమైనప్రయత్నంచేస్తాడనీ, ఆప్రయత్నాన్ని మన ముఖదుకోవాలనీ ఊహించరాని విషయంకాదు. అమెరికాసంయుక్తరాజ్య సహాయంద్వారావున్న నౌకాబలంవృద్ధిచెందేలోపుగానే హిట్లరు ఈప్రయత్నాన్ని సాగించవచ్చును" అని బ్రిటిష్ నౌకాశాఖామంత్రి క్రాస్ గారు లండనులోజరిగిన ఒకసమావేశంలో ఫిబ్రవరి ౮ వతేదీన ఉపన్యసించెను.

బ్రిటిషువారికి సంభవించిన నౌకానష్టాలలో చాలాభాగం బ్రిటిషుఆధీనమైనశత్రు నౌకలతోనూ, మిత్రరాజ్యాలు పంపిననౌకాబలంతోనూ, అమెరికా సంయుక్తరాజ్యపు కొన్ని నౌకలతోనూ భర్తీఅయినవని నౌకాశాఖామంత్రి తెలియజేశాడు. ఇకమీద ఈవిధంగా తమనౌకానష్టాలు భర్తీకాగలవని అనుకోనవీల్లేదనిరి. ఇప్పుడు మాత్రం తమకుసంభవిస్తున్న నౌకానష్టాలు సహాయంగావచ్చి చేరుతున్ననౌకలకంటె తక్కువకట బ్రిటనువ్యాపారనౌకాబలం ప్రస్తుతం తక్కువగావున్నదనీ, హిట్లరుతనబ్రహ్మాండమైన ప్రయత్నాన్ని సాగించకముందే తామతమబలాన్ని వృద్ధిచేసికొనుటయు, అమెరికాచేసేసహాయాన్ని పుచ్చుకొనుటయు జరుగవలెననిరి.

జనవరి ౨౬, ౨౭ తేదీలతో ఆఖరైనవారంలో బ్రిటిషువారివీ మిత్రరాజ్యాలవారివీ నష్టపడిననౌకలసంఖ్య పగటుకు తక్కువగానేవున్నది. ఈవిషయాన్ని నౌకాశాఖాప్రకటన తెలియజేస్తున్నది. మొత్తంఈవారంలో ౭ బ్రిటిషునౌకలు నష్టపడినవనీ, రెండుమిత్రరాజ్యాలనౌకలనీ ప్రకటించబడినది.

## ఫ్రాన్సుకు జర్మను బెదరింపులు

(మొదటిపేజి తరువాయి)

ఫ్రెంచివిదేశాంగమంత్రి ఫ్లాండిన్, దేశీయాంగశాఖా మంత్రి రాజీనామాలు ఇస్తారనితెలుస్తున్నది.

లావల్, బోడూయిన్, అడ్మిరల్ డార్లాన్ జనరల్ హంటిగర్ లతోకూడిన పరిపాలక డైరెక్టరేటు ఏర్పడవచ్చునని సూచనప్రాయంగా తెలుస్తున్నది.

మార్షల్ పెటెయిన్‌కు లావల్ చేసిన షరతులు అంత్యసందేశంతో సమానంగాఉన్నవని బెర్లినులో అనుకుంటున్నారు. వాటిని అంగీకరించినట్లయితే అసాధారణాధికారాలతో లావల్ ప్రధానమంత్రికావడం, మార్షల్ పెటెయిన్ జర్మనీలో ఈకాలంలో ప్రెసిడెంట్ హిండెన్‌బర్గుకు ఉన్నపాటి హోదాతోనిలవడం సంభవిస్తుందని అనుకుంటున్నారు. ఏపరిస్థితులలోనయినా లావల్ విషీకిమరలిరాడనీ, పారిస్ లోనే ప్రభుత్వాన్ని ఏర్పాటుచేస్తాడనీ బెర్లినులో భావించబడుతున్నది. లావల్ తనచేతిలోనేప్రభుత్వంఅంతాఉండాలనీ, మంత్రులను నియమించడం, తీసివెయ్యడం తనఅధికారంలోనే ఉండాలనీ, ఒక్కమార్షల్ పెటెయిన్‌కుమాత్రమే తాను జవాబుదారీవహించవలసివుంటుందనీ తెలుస్తున్నది మార్షల్ పెటెయిన్ ఫ్రెంచి రిపబ్లిక్ అధ్యక్షులవలె రాష్ట్రాధిపతిఅనే హోదా కలిగిఉండాలని లావల్ అంటున్నారు.

ఫ్రాంకో-జర్మన్ యుద్ధవిరామషరతులకుమించినసహాయాన్ని జర్మనీకి అందజేసేవిషయంలో మార్షల్ పెటెయిన్‌కూ, హిట్లరుకు మధ్యఏర్పడ్డ సంఘర్షణ అటోఇటో తేలేవరకూ, రాబోతున్నట్లు కనబడుతున్నది.

ఏదోవిధంగా లావల్ మరలి తమలోచేర్చుకోడానికి రాజీపద్ధతికోసమే విషీప్రభుత్వ కూడా తొందరపడుతున్నట్లు కనబడుతున్నది. లావల్‌ను విషీప్రభుత్వంలో చేర్చుకున్నప్పటికీ, లావల్ కోరేఅధికారాలన్నీ ఇవ్వబడకపోవచ్చు మార్షల్ పెటెయిన్ తగినసమయంకోసం ఎదురుచూస్తున్నట్లు కనబడుతున్నదికాని హిట్లరు మాత్రం ఫ్రాంకో జర్మన్ సహకారవిధానం ఈ నెలాఖరులోపుగా ఆచరణలోకిరావలెనని కోరుతున్నాడు.

గతడిసెంబరులో లావల్‌కు పెటేన్‌మంత్రివర్గంలో స్థానంపోవడానికికారణం జర్మనీతోఅతడు రాయబారాలు కొన్ని పూర్తిచేసి ప్రంపడమే అని యూరప్‌నుండి ఇక్కడికిఒకరాజకీయవర్గానికి వస్తున్న వార్తలవల్ల తెలుస్తున్నది. ఈరాయబారాలలో లావల్ ఫ్రెంచి నౌకాదళం జర్మను ఉపయోగించుకొనుటకు మెడిటరేనియన్ కాలనీలయందు విశేషానుమతిని ఇచ్చుటకు ఒప్పుకున్నాడని తెలుస్తున్నది. లావల్ తిరిగిమంత్రివర్గానికి వచ్చినప్పుడు వెనుకటిఒడంబడిక ఒప్పుకోవాలని బెర్లిను కోరుతున్నదికాని మార్షల్ పెటెయిన్ అంగీకరించలేదని తెలుస్తున్నది.

ఈలోపున మార్షల్ పెటేన్ మంత్రివర్గంలో మొదటివిదేశాంగమంత్రిగా పనిచేసిన పాల్ బోడొయిన్‌కు ఒకకొత్తపదవి ఇవ్వబడినట్లు తెలుస్తున్నది. ఇండో-చైనా బ్యాంకు అడ్మినిస్ట్రేటివ్ కౌన్సిల్ అధ్యక్షుడుగా ఇతను నియమించబడినాడని తెలుస్తున్నది.

ఫిబ్రవరి౧౦వతేదీ తెల్లవారుజామున పారిస్ నుండి బయల్దేరడానికిముందు అడ్మిరల్ డార్లాన్ ఇంకా కొంతకాలం ఓడించబడని ఫ్రెంచినౌకాదళాధ్యక్షుడుగా, ఫ్రెంచినౌకాదళం ఫ్రెంచివారిదిగానే ఉంటుందనీ, ఫ్రెంచిసామ్రాజ్యరక్షణను పూనుకుంటుందనీ ఒకప్రకటనచేసెను.

౨౦౦మందిసభ్యులతో పెటెయిన్ నియమించిన కొత్తఅడ్వైజరీ నేషనల్ కౌన్సిల్ ఫిబ్రవరి నెలాఖరున క్లెర్మాంట్ ఫెర్రాండ్‌లో మొదటిసారి సమావేశమగునని తెలుస్తున్నది.

### అరువు, కవులుబిల్లు

అమెరికా శాసనసభయగు ప్రజాప్రతినిధిసభలో ఆరువు కవులుబిల్లు ఫిబ్రవరి౯వతేదీన అమోదించబడినది. ఇకఅదిసెనేటుసభలో ఆమోదించబడవలసియున్నది. ప్రతికూలపక్షీయులు ఎన్ని ఆక్షేపణలుచేసినను ఫలితములేక పోయినవి.

### హిట్లరు డిప్యూటీగారి బెదరింపు

హిట్లరు డిప్యూటీయగు హెర్ హెస్ జర్మను సైనికులకు ఫిబ్రవరి౯వతేదీన ఉపన్యసించుచు రాబోవు వసంతకాలంలో ఇంతవరకున్న పూర్తిగా ప్రయోగించని జలాంతర్గాముల నష్టిటిని ప్రయోగించి యుద్ధముచేయబడుననిరి. జర్మనులకు జయముకలుగునంతకు ఆ యుద్ధము సాగింపబడుననిరి

జర్మనులు విషవాయువులు కూడ ప్రయోగించవచ్చుననితలంపుతోనే బ్రిటిషువారు అన్నిజాగ్రత్తలు పడుచున్నారు. జర్మను విమానాలు బాంబులు వేస్తూఉండే వెంటవెంట యుద్ధావసరపరిశ్రమలను సాగించేభవనాలు పాడుగాకుండ మరిపేరిచేయుటకై బ్రిటిషువారు ఏర్పాట్లు చేసికొనుచున్నారు

ఫిబ్రవరి౧౧వతేదీన బ్రిటిషుప్రధాని చర్చిలుగారు బ్రాడుకాస్టుఉపన్యాసంలో రూజ్వెల్టుగారికి ఈక్రిందిసందేశము తెలిపిరి.

"మాయందు విశ్వాసముంచి,ఆశీర్వదించుడు. భగవంతునిదయవల్ల అంతయుసరిగాజరుగగలదు. మేముతొణకము. దౌర్బల్యమునుగాని, అలసటనుగాని మాపము. ఆకస్మికయుద్ధమువచ్చినను అదరుగాని, దీర్ఘకాలము కనుపెట్టుకొని శ్రమపడుచుండుటగాని మాశక్తిని క్షీణింపజేయదు. మాకు పనిముట్లుపంపండి. పనిని మేము పూర్తిచేసెదము"

### గమనిక

ఈపత్రిక ౫వ పేజీలోను ౧౦ కాలములోను యున్నప్రకటనలో, ఖాదీని తక్కువధరలకు అమ్ముకాలనిర్ణయము పొరపాటున ౧౮-౨-౪౦ తేదీకి బదులుగా ౧౫-౨-౪౦ అనియు, మాఘ శు 3 లకు బదులు ౭ ౫ అనియు ప్రకటింపబడినది. గనుక గమనింప ప్రార్థన మాఘ శు 3 లు శుక్రవారమునకు మాత్రమే రూపాయికి 0-2-0 తగ్గింపు ఉపయోగము వస్త్రములు యీ క్రింది రెండుదుకాణములలోను దొరుకగలవు.

హైదరాబాదు ఖాదీస్టోర్సు, అబిడ్ రోడ్.

భాగ్యనగర ఖాదీ వస్త్రాలయం, సుల్తాన్‌బజారు, హైదరాబాదు-దక్కన్.

## కృపాణమునుగూర్చి ప్రభుత్వాజ్ఞ

హైదరాబాదు(దక్కన్), ఫర్వర్ది ౧౦

ఆయుధాలను వెంటనిడుకొని తిరుగకుండుటనుగాను ప్రభుత్వమువారి అజ్ఞ అయినప్పుడు సిక్కులుతమవెంట కృపాణము నుంచుకొనుటకు మాత్రము అర్హులు. కృపాణము అనగా ౯అంగుళములకుమించని ఆయుధమును వెంటనుంచుకొనవచ్చునుగాని ౯అంగుళములకు ఎక్కువపొడవుగల కత్తులు కృపాణములుగా ఎంచబడవు అని హైదరాబాదు ప్రభుత్వమువారు అజ్ఞాపించినారు.

### కొత్వాలుగారు

హైదరాబాదు ౭ ఫర్వర్ది.

నవాబు రహమతుయారుజంగు బహద్దరు కొత్వాలుగారికి మహాఘన. నిజాము ప్రభువుగారు ఉద్యోగమందు రెండుసంవత్సరములను హెచ్చించిరి.

కొత్వాలుగారికి సీనుకెమంపసలీతో ఉద్యోగకాలము ఆయిపోవును. అప్పటినుండి ఈ హెచ్చుకాలం పరిగణించబడును.

### హంగరీ యుగోస్లావియాల ఒడంబడిక

ఇటీవల యుగోస్లావియా హంగేరీలమధ్య ఒక ఒడంబడికజరిగినది యూరపులో నూతనవ్యవస్థను సృష్టించుటకుజర్మనీ ఇటలీలు చేస్తున్న కృషి నితనుసరించే యుగోస్లావియా, హంగరీల మధ్య ఈఒడంబడిక జరిగిందని హంగేరియా ప్రధాని తమపార్లమెంటుకు చెందిన విదేశాంగవ్యవహారాల కమిటీలో ఫిబ్రవరి ౨౬ తేది ఉపన్యసిస్తూ తెలియజేసెను.

ఈఒడంబడికపైన సంతకాలుచేసే హంగరి, యుగోస్లావియా రాజ్యాలు యూరపీయశాంతికి దోహదం చేసినవవిమాడా అయినవని సెను.

### బల్గేరియా రష్యాను నమ్ముకొనుట

బల్గేరియా విదేశాంగనీతిని, అంతర్జాతీయవ్యవహారములో బల్గేరియాపరిస్థితిని స్పష్టీకరించవలెనని కోరుచు ౧౫గురు బల్గేరియా పార్లమెంటుసభ్యులు ఒకవిపులమైన ప్రశ్నావళిని ప్రకటించినారు. దీనిని త్వరలో పీరు బల్గేరియా పార్లమెంటులో ప్రవేశపెట్టదలచుకొనినారు.

ఇందులో సంతకాలు చేసినవారిలో సుప్రసిద్ధప్రజాసామ్యవాది ఒకరు మరికొందరుఆతి దులు కమ్యూనిస్టులువున్నారు. ఈదిగువవిషయాలపై ప్రభుత్వ వైఖరిస్పష్టీకరించవలసినదిగాఅందులోకోరబడినది ౧౧ హిట్లరుగారితో బోరిస్‌రాజుగారి సంభాషణ. ౨ బల్గేరియా స్వాతంత్ర్యానికి భంగంకలుగనున్నదా? అయితే విదేశసేనలు దేశాన్ని ఆక్రమించకుండా ఎట్టిచర్యలు తీసుకొనబడినవి. (౩) ప్రెసిడెంటు రూజువెల్టు ప్రత్యేకరాయబారి కర్నల్ డోనావాన్ వచ్చినపనియేమి

(౪) ఆగ్నేయ యూరపులో దీర్ఘయుద్ధము వచ్చి ఎతరబాల్కన్ రాజ్యాలనుకూడా అందులోనికి లాగగలప్రమాదంఉన్నప్పుడు బల్గేరియా పరిస్థితి ఎట్టిది? (౫) రష్యా విదేశాంగమంత్రివర్గపు సెక్రటరీజనరల్ సోబోలెవ్ ఇటీవల బల్గేరియాకువచ్చిన సందర్భంలో రష్యాతో బల్గేరియా నిరాక్రమణ సంధిచేసుకుంటుందనే వదంతులలో నిజమెంత?

యూరపుఅంతటికీ ఒక్కటేగొప్ప తటస్థరాజ్యం రష్యామాత్రమే ఆనీ, బాల్కన్‌ప్రాంతంలో రాజకీయపరిస్థితి, బల్గేరియా ముమ్దుకు జేరాలన్నిటికీ విశ్వాసపాత్రమైన తప్పించగలశక్తి రష్యాకుమాత్రమేఉన్నదనీ బల్గేరియా నమ్ముచున్నట్లు ఆప్రకటనలో ఉన్నది.

నాజీలపట్ల అభిమానంగలవాడుగా పేరుపడిన స్టోయిమా మంత్రివర్గ్రియా వాఫ్, ఫిబ్రవరి ౧౫ తేదీ ఉ యుం రాజీనామా నిచ్చెను. మంత్రిరాజీనామాను బోరిస్‌రాజు అంగీకరించాడు. అనువదిక ప్రధానమంత్రి ఫిలాఫ్ స్వాధీనపర్చుకొనెను

## బ్రిటనుపై శత్రుసేనల దండయాత్రభయము

వివిధాభిప్రాయాలు

"మనకు అత్యంతకఠినపరీక్ష ముమ్దుందు రానున్నది. ఇప్పటికంటెకూడ ఎక్కువధైర్యము ఓర్పుకలిగియుండవలెను. ప్రపంచంలో ఇదివరకెన్నడు కనివినియెరుగని గొప్పసేన మనమీదపడబోవుచున్న సమయముదగ్గరపడుచున్నది. ఒంటరిగా ఈ దినమును ప్రతిఘటించవలెను జయించుటయో నాశనమగుటయో తప్పదు. మనచరిత్రఅంతటికిగొప్పదీ అద్భుతమైనదీ అగుసమయము సమీపించుచున్నది. ఈవిధంగామనకు తీవ్రపరీక్ష జరిపించుట ఇదిమొదటిసారికాదు", అని బ్రిటిషునౌకామంత్రి అలెగ్జాండర్ గారు జనవరి ౩౧వతేదీ హాస్టింగులో ఉపన్యసించుచు చెప్పిరి.

జనవరి ౩౧వతేదీన హాలిఫాక్సు ప్రభువును కొందరు పత్రికాప్రతినిధులు ప్రశ్నింపగా-అతడు "రోజులవిషయమైనాకు వర్తమానంఏమీరాలేదుగాని, ఇటలీలోను, బాల్కనులలోను పరిస్థితుల వల్లనూ, జర్మనీలో అంతరంగిక స్థితిగతులవల్లనూ హిట్లరు త్వరలోనే దండయాత్రప్రయత్నము చేయగలడనికనబడుచున్నది అనిచెప్పెను.

ఫిబ్రవరి ౧౫వతేదీన కెనడా ప్రధానమంత్రి మెకెంజీకింగ్ ఈదినంయుద్ధనిధి సేవింగ్ సర్టిఫికేట్లు కొనవలసినదిగా ఉద్బోధిస్తూ త్వరలోనే యుద్ధములో ఒకకొత్తఉపద్రవం రాబోతున్నదని హెచ్చరించెను.

"మరికొన్ని వారాలలోనే ప్రపంచంఇదివరకెన్నడూ కనివినియెరుగని గొప్పయుద్ధాన్ని చూడబోతున్నామని నిశ్చయంగాచెప్పవచ్చును" అని కెనడా ప్రధానిఅనెను.

ఫిబ్రవరినెల మొదటిరోజులలో బ్రిటనుమీద దండయాత్రజరుగునని విషీలో సమర్థులగు పరిశీలకులు భావించుచున్నారు. ఇంగ్లీషు ఛానల్ దాటుటకు పరిస్థితులుఅప్పుడు అనుకూలంగాఉండునట హాలెండ్, బెల్జియములలో ఇందుకై అన్నిరకాలసన్నాహాలూ తీవ్రంగాజరుగుచున్నదట. ఆకాశంమీదనూ, భూమిమీదనూ ఉపయోగించే కొత్తకొత్తయంత్రాలనుగురించి చాలావదంతులు ఉన్నవి.

"విమానదాడులవల్ల భవనాలకు ఈరోజువరకూకలిగిననష్టం బ్రిటను ఒకేఒక సంవత్సరంలో సాగించగలిగిన నిర్మాణశక్తిని మించివుంటుందనిగాని, సరిసమానంగావుంటుందని కొందరుభావించను." అని ఫిబ్రవరి ౪వతేది సుప్రసిద్ధఆర్థికశాస్త్రవేత్త జె. ఎం. కీన్స్ వెలిబుచ్చెను. "ఈదేశంలో ఈనాటిభవనాలు మొత్తంమీద ౧౯౧౪లో కంటెఎక్కువ విలువకలిగివున్నవి. అందుచేత విమానదాడులవల్లనష్టంకలగడం ఒకవిధంగా మంచి అవకాశమేనన్నమాట ఏదోఒక హద్దుమీరిపోయినప్పుడు మాత్రమే ఈనష్టపరిస్థితి పెద్దవిపత్తుగా భావించవలసివుంటుంది." అని ఆయన నుడివెను.

ఒక జర్మను పత్రికసంపాదకీయంలో యుద్ధనౌకలు పటిష్టమైనవి అయినప్పటికీ ... అని ఇంకా అధికంగా అంతకు ముందు ఆకాశమార్గంనుండి జరుగవలెనని వ్రాసినది. "ఇంతవరకు కలిగిన ఫలితాలనుబట్టి చూస్తే యుద్ధనౌకలుజయింపరానివనే ఊహ మారిపోవుచున్నది. కొత్తశత్రువగు వాయువిమానంమీదికి యుద్ధనౌకలు కొత్తకష్టాలు ఎదుర్కొనవలెను. మహాసముద్రాలలో ఇవిచరించవలెనే ఇకమీదకూడా యుద్ధవిమానాలు నిరోధంగాసంచరించగలవు. ఈసంగతిని జర్మనీ గ్రహించుకోవలెను. ఆపైన ... సబలం ... వారే ముమ్దుందు ... సమస్యలపై ... " అని ఆపత్రిక వ్రాసినది.

ఈసందర్భంలో ... కొన్ని విశేషాలు వినబడుతున్నవి యుద్ధప్రారంభంలో ... బ్రిటనుకు ౧౫ యుద్ధనౌకలు సిద్ధంగాఉన్నవి. ౯ నిర్మాణదశలో ఉన్నవి ఒకటినష్టమయినది. తర్వాత జర్మనీకి ౨ యుద్ధనౌకలు సిద్ధముగాఉన్నవి. ౪ తయారీలోఉన్నవి ఇవికాక 3 పాకెట్ యుద్ధనౌకలుకూడాఉన్నవి. వీటిలో ఒకటినష్టమయినది.

ఇటాలీయులకు ౪ యుద్ధనౌకలు సిద్ధంగాను ౪ తయారీలోనుఉన్నవి. వీటిలోకనీసం మూడునౌకలు కొన్నినెలలదాకా పనిచేయుటానికి వీలులేనిదెబ్బలుతిన్నవి.

## అబ్దుల్ అరబుకు శిక్ష

హైదరాబాదు, ౯ఫర్వర్ది

అబ్దుల్ అరబుఅను సిపాహి గ్రాండుట్రంకు ఎక్స్‌ప్రెస్ రైలుబండిలో ఖజానాకుకాయుటకు నియమింపబడియుండెను. రైలుబండి కొర్లకలు సమీపించినప్పుడు స్థలంకొరకు పోట్లాటజరిగెను. ఆపోట్లాటసందర్భమున అబ్దుల్ అరబు బందియాతో రక్షకభటులను గాయపరచియుండెను.

గత గురువారమునాడు సికింద్రాబాదు జిల్లా సెషన్ న్యాయాధికారియగు దీవానుబహదూరు పి.సి. లాబో గారు కేసునువిచారించి నిందితునికి ౩సంవత్సరముల కఠిన ఖైదుశిక్షను విధించిరి.

### మున్సిఫీ న్యాయస్థానము మార్పు

ప్రధానమంత్రిగారి అనుమతి ననుసరించియు భూమ్యాదాయశాఖ కార్యదర్శిగారి అభిప్రాయానుసారము బూర్గంపహాడు మున్సిఫీ న్యాయస్థానమును పాల్వంచకు మార్చుట కనుజ్ఞ నీయబడినది.

### శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము (హైదరాబాదు దక్కను)

## పోతనవర్ధంతి

ఈమాఘ ౹౨ గురువారము (౧౩-౨-౪౧) సాయంకాలము ౬గంటలకు. నిలయభవనమున శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరము. బి.ఏ.(ఆనర్సు) గారి అధ్యక్షతలో, శ్రీ విద్వాన్. కె. వి. నరసింహశాస్త్రిగారు, "ఆంధ్రకావ్యము—పోతనసేవ"అను విషయముపై ఉపన్యసింతురు.

### మరణము

రాజాధీరజ్ కరణ్ గారు బొంబాయిలో చనిపోయిరి.




Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A B.L.